# “శ్రీరంగమ్”

దక్షిణ భారతదేశమందు, కావేరినది, దాని ఉపనది కొల్లడముల మధ్య, తిరుచిరపల్లికి ఉత్తరదిశలో ఐదు కిలోమీటర్ల దూరంలో ఉండే, దివ్య ద్వీపం శ్రీరంగ క్షేత్రము. అచ్చట శేషశయనుడైన శ్రీరంగనాథుడు క్షేత్రస్వామి క్షేత్రస్వామిని శ్రీమతి రంగనాయకి. ఆ దేవులు అశేషజనానీకానికి తమ ప్రసన్న మందహాస మధుర దయార్ద్ర దృక్కులతో దర్శనమిచ్చి అనుగ్రహించే క్షేత్రరాజమిది అష్టోత్తర శత వైష్ణవ ధామాలలో అగ్రగణ్యం శ్రీరంగము. దాక్షిణాత్య ప్రఖ్యాత ఆళ్వారులు అందఱు శ్రీరంగని ప్రముఖ భక్తులై హృదయంగమంగా పాశురాలను పాడిన ఆ పుణ్యప్రదేశంలో, శ్రీమతి రంగనాయకి సన్నిధియందు, కంబర్ కవిచక్రవర్తి. తమిళరామాయణ కావ్యాన్ని రచించి, భగవదర్పణముచేసినాడు. శ్రీమాన్ యామునాచార్యులు, శ్రీమద్రామానుజులు, పీఠాధిపతులై తమ సంగీత విభావరిచే శ్రీరంగాన్ని అంగరంగ వైభవంతో విలసిల్లచేసినారు

సప్త ప్రాకారాలతో విస్తరించి, శిల్పకళా వైభవముతో విరాజిల్లు విశాల భూమి యందు శ్రీరంగనాథుని స్తుతించిన చేరరాజు శ్రీమాన్ కులశేఖరాళ్వారుల “ముకుందమాల” రచయితగా అతిప్రసిద్ధుడు. అద్దాని సంస్కృతమూలము, వచనాకృతి మఱియు, శ్రీవిల్లిపుత్తూరు నివాసి, శ్రీమతి ఆండాల్ విరచితమైన “తిరుప్పావై” మూలము, సారము గ్రంథమందు ప్రాధాన్యము వహించినవి

ముఖచిత్రం శ్రీ విల్లిపుత్తూరు గోపురం మీద పూర్వార్ధం రంగమన్నారు, ఉత్తరార్ధం గోదాదేవి

శ్రీవాసుదేవాయనమః

# ముకుందమాల - తిరుప్పావై

(భావానువాదము)

# ఏడుకొండలు - ఏడుకాండములు

(సంక్షిప్తకృతి)

# శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి భవ్యచరితము

సద్గురూత్తంసులు

**శ్రీ కందుకూరి శివానందమూర్తి**

మహోదయుల దివ్యాశీస్సులతో




**వజ్ఝల వేంకటసుబ్రహ్మణ్యశర్మ**

Mukundamala - Thiruppavai (Bhavanuvadamu)
Edukondalu - Edukandamulu (Samkshiptakrithi)
Thirumoli (Prastavana)
Sri Bhashyam Appalacharya Bhavya Charitamu

Author V.V Subramanya Sarma



First Edition . November, 2004

Copies . 1000

Price Rs.50/-

For Copies :
Navodaya Book House,
Sultan Bazar, Hyderabad-27

V.V.S Sarma
201, Land Mark Appartments,
West Maredpally, Secunderabad-26
Phone 27715148, 24012563

Printed at .
Anupama Printers
Green View, 126, Shanti Nagar, Hyderabad-28
Phone : 23391364, 23304194

శ్రీ అప్పలాచార్యస్వామి
దివ్య స్మృతికి
అంకితము

# ప్రకాశిక

విశాఖపట్నం శ్రీ గురజాడ కళాక్షేత్ర ప్రాంగణంలో వేదిక మీద 4-4-2003 తేది, సాయంకాలం, శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారు తమ 'సహస్ర చంద్రదర్శన మహోత్సవ' సమావేశంలో ఆసీనులయ్యారు ఆనాటి అధ్యక్షులు విశ్రాంత న్యాయమూర్తి శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారు ఆ శుభసమయంలో, శ్రీమాన్ ఆచార్యులవారి ప్రక్కనే వేదిక మీద కూర్చున్నాను. నా సంగ్రహ ప్రసంగమైన తర్వాత, శ్రీమాన్ ఆచార్యస్వామివారి కరకమలాలనుండి శ్రీచిత్రకవి ఆత్రేయ విరచితమైన "ప్రవచన శిరోమణి" అనే పేరుగల శ్రీ భాష్యంవారి జీవిత చరిత్ర గ్రంధాన్ని అందుకొనే భాగ్యం కలిగింది. అందులో లోపలి కాగితం మీద, శ్రీ భాష్యంవారు చలించే అక్షరాలతో

"అనేక మంగళాశాసనములు
శ్రీ అప్పలాచార్యులు"

అని సంతసంతో సంతకంపెట్టి ఆశీర్వదించారు. అప్పుడు నేను పొందిన పారవశ్యం చెప్పలేను. ఆ అదృష్ట సన్నిధానం, అపూర్వ సన్నివేశం. ఎల్లవేళలందు స్మరింపదగ్గ సంఘటన అది. సమావేశానంతరం శ్రీవారితో వారి భవ్య జీవితాన్ని వ్రాయాలని నాలో ఉత్సాహం ఉప్పొంగుతుందని నా తలంపును తెల్పాను వారు తల ఊపినారు. వారి ఆమోదంతో నా సంకల్పం చిగురించింది.

ఆ మహోత్సవ కాలంలో, సదస్సులందఱు ఏకకంఠంతో శ్రీమాన్ ఆచార్యస్వామివారు నూరేళ్ళు జీవించాలని ఆశించారు. కాని విధివ్రాతను తప్పింపలేము కదా! ఆ సంవత్సరమే జూన్ నెల, ఏడవతేది. వారు తుది శ్వాస వదిలారు అంత త్వరలో శ్రీ ఆచార్యులవారు శాశ్వతంగా అందఱిని వీడిపోతారని ఎవ్వరు ఊహింపలేదు. అందఱు, వారులేని లోటును జీర్ణించుకోలేకపోయినా, అందఱి ఎదలలో, వారి మధురవాక్కులు, అనుగ్రహ దృక్కులు గట్టిగా ప్రతిష్ఠించి నిర్గమించారు. స్థిరకీర్తి స్ఫురణతో, వారు సజీవులుగానే ఉన్నారు. జీవిత సాఫల్యమంటే అదే కదా!

శ్రీమాన్ శ్రీభాష్యంవారి అంత్యదశలో అంటే వారి జన్మదినోత్సవ కాలంలో విశాఖపట్నం వెళ్లడానికి ప్రేరకులైనవారు విశ్రాంత న్యాయమూర్తి శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారు.

మాటల సందర్భంలో, మార్చి నెల, 2003 సం॥ వారు తాము విశాఖపట్నం శ్రీవారి సహస్ర చంద్రదర్శన మహోత్సవంలో పాల్గొనడానికి వెళ్లుతున్నట్లు వచించారు. అప్పుడు, శ్రీభాష్యం అప్పలాచార్యులు, నేను శ్రీకాకుళంలో కళాశాలలో కలిసి పనిచేశామని, నాకు ప్రియమిత్రులని చెప్పాను. వెంటనే శ్రీ కోదండరామయ్యగారు, విశాఖపట్నంలో ఉండే శ్రీ కె.వి.రామమూర్తికి ఫోనుచేసి, నన్ను ఆహ్వానింపవలసిందిగా సూచించారు. శ్రీరామమూర్తి శ్రీభాష్యంవారి ఆమోదంతో నన్ను విశాఖపట్నం రప్పించారు. ఆ విధంగా ఆచార్యులవారితో సంయోగానికి అవకాశం ఏర్పడింది ఆ ఇరువురికి మనసారా కృతజ్ఞతలు. పరోక్షంగా ఆ ఇరువురు ఈ గ్రంథం వెల్వడడానికి కారకులు. అందువల్ల వారిని స్మరించాను.

శ్రీ చిత్రకవి ఆత్రేయ శ్రీభాష్యంవారి జీవిత చరిత్రను "ప్రవచనశిరోమణి" అనే పేరుతో తిరుప్పావై సూక్తులతో అనుసంధించి, చక్కగా చిత్రించారు ఆ గ్రంథం వర్ణచిత్రపటాలతో ఆకర్షణీయంగా ఉంది. అయితే ప్రస్తుత గ్రంథం ఎందుకనే వారికి సమాధానం చెప్పాలికదా!

ఇది కేవలం సంక్షిప్త చిత్రణం. శ్రీ భాష్యం వారితో నాకు గల సన్నిహిత సంబంధాన్ని నెమరు వేసుకొంటూ కొన్ని క్రొత్త అంశాలను, కొందఱి మిత్రులను గుఱించి చెప్పదలచు కొన్నాను. శ్రీమాన్ ఆచార్యస్వామివారిని ఎఱిగినవారు, విన్నవారు, చూచినవారు అనేకులు న్నారు. వారిని ఎఱుగని వారికి శ్రీమాన్ ఆచార్యస్వామివారి మూర్తిత్వాన్ని ప్రకాశితం చేయడానికే ఈ సంక్షిప్త కృతి. సామాన్యులైన "శ్రీ అప్పలాచార్యులు", మహామాన్యులై బహుమాన్యులైన వృత్తాంతాన్ని, వారి రమ్యతత్త్వ దీపికలను, చదువరులు చదివి వానిలో మాధుర్యాన్ని ఆస్వాదించాలని నా ఆశయం. అందుకనే శ్రీమాన్ ఆచార్యులవారికి మిక్కిలి ప్రీతిపాత్రములైన ముకుందమాల తిరుప్పావై, ఏడుకొండలు-ఏడుకాండములు ఈ గ్రంథంలో ప్రాధాన్యం వహించినవి.

"తిరుమొళి" అనే ఆండాళ్ మఱొక రచనను గూడ ఇందులో ప్రస్తావించాను. దీనికి అధార గ్రంథం, పాంచరాత్ర ఆగమశాస్త్ర ప్రవీణులు శ్రీమాన్ అచ్చి వేణుగోపాలాచార్యులు రచించిన "గోదా శ్రీకృష్ణ తృష్ణ" అనే తిరుమొళి, తెలుగు గేయానువాదం. వారి గేయరచన "తిరువాయ్‌మొళి", "సహస్ర సంపంగిమాలా అలంకారము" అనే, మఱొకటి త్వరలో వారిది వెల్వడగలదు

డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారి, శ్రీ అప్పల సోమేశ్వరశర్మగారి జీవిత విశేషాలు ఆంగ్లభాషలో, ఇందున్నవి. వారి సాహితీసేవలను చదువరులు గుర్తింతురుగాక!

మఱొకమాట. పాఠకులు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి భవ్యజీవితమును చదివి, వారి గ్రంథాలలోని భగవత్ శ్రీతత్త్వాలను ఆస్వాదించి తమ జన్మలను తరింపజేసి కొందురుగాక.

## వర్ణచిత్రాలు :

ఈ గ్రంథంలో శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ సౌజన్యంతో వారి "ప్రవచన శిరోమణి" నుండి, ఆదర్శదంపతులు, శ్రీ చిన్నజీయర్‌స్వామి, శ్రీ ఆచార్యస్వామి వర్ణచిత్రాలు మరియు డా. వి. వి. వేంకటరమణ ప్రోత్సాహంతో, శ్రీ బాపుగారి సౌజన్యంతో వారి "తిరుప్పావై" నుండి ఆండాలు, రంగమన్నారు, వర్ణచిత్రాలు, మఱియు డా అక్కిరాజు రమాపతిరావుగారిచ్చిన "ఆండాలు రంగమన్నారు గరుడుని వర్ణచిత్రం" (చివరి వెలుపలి అట్టమీద) చేర్చబడినవి. అవి చాల ఆకర్షణీయముగా ఉన్నవి.

టైప్‌సెట్టింగ్ కావించిన చి॥ రవిచంద్రకు, చి॥ జ్యోతికి సకాలంలో ముద్రించి ఇచ్చిన అనుపమ ప్రింటర్స్ అధిపతి శ్రీ రమణమూర్తికి, శ్రీ సుబ్బయ్యగారికి మఱియు వారి సిబ్బందికి సహకరించిన సహృదయులందఱికి ధన్యవాదములు

"ఓం తత్ సత్"

హైదరాబాదు
11-11-2004

– *వి. వి. సుబ్రహ్మణ్యశర్మ*

# Tribute to Justice P. Kothanda Ramaiah Garu

Justice P. Kothanda Ramaiah garu was born in the year 1926 He was an advocate of the Madras High Court from 1952 and was elevated to the Bench of the Andhra Pradesh High Court in the year 1982 and held the office till 1988

He has been the Founder / Chairman of the "Arsha Vignana Trust", Hyderabad and published Vālmiki Rāmāyana and Vyāsa Mahābhārata with comentary in Telugu

He belongs to the family of the devotees of Sri Rama and has been a staunch devotee of Sri Rama as Sriman Sri Bhashyam Appalāchārya Swāmi was He had the good fortune to visit Sri Appalacharya Swami on the occasion of his Sahasra Chandra Darsana Mahotsavam in April, 2003 at the T T D Kalyana Mandapam at Visakhapatnam to present new clothes to the sacred couple and seek their blessings (This writer was there at that time )

"The Light of Ramayana" (1997, 1999) in English authored by Justice P Kothanda Ramaiah garu is a magnificent Master-piece, a brilliant critically analytical contribution of all perfect virtues of Sri Raghu Rama who is praised as "Suganābhirāma"

His another book entitled, "The message of Mahabharata" in English was released last year, 2003 at Hyderabad. This is also equally a good work of hard labour of high quality

The author impresses the readers with his deep scholarship in Epics and Scriptures

Sri K Parāsaran, Senior Advocate, Supreme Court of India, Formerly Attorney General of India, observes, "An excellent Lawyer and a Judge, he has excelled himself as a writer and author" His two books specially serve as intoxicating sources of ancient eternal values to guide the youth to follow the Aryan Path of righteousness

**– V. V. Subramanya Sarma**

Hyderabad

Date · 1-12-2004

# ముకుందమాల

## పరిచయ వాక్యాలు

"ముకుందమాల" నలుబది సంస్కృత శ్లోకములు గల కృతి. పన్నిద్దరు ఆళ్వారులు భగవానుని అర్చావతార మాహాత్మ్యమును లోకానికి చెప్పినారు. వీరిలో శ్రీ కులశేఖరులు ఒకరు. వారి కృతియే "ముకుందమాల" వీరు క్షత్రియులు. కేరళ దేశమును తిరువనంత పురము రాజధానిగా, రాజ్యమును పాలించిరి తిరువనంతపుర మందు క్షేత్రస్వామి, అనంత పద్మనాభుడు.

భగవానుని యెడ భక్తికంటె భాగవతుల సేవలో మక్కువ నెక్కువగా చూపెడి పరమ వైష్ణవుడు శ్రీ కులశేఖరాళ్వారు.

"ముకుందమాల" అనగా, ముక్తినిచ్చు స్తోత్రముల సమూహము. దీనిని పఠించుటచే నరునకు శ్రీకృష్ణ భక్తి వృద్ధి పొందును. భక్తియే పరమపురుషార్థము. అయ్యది పరమ పదప్రాప్తికి సులభోపాయము కావున మానవుడు శ్రీ కృష్ణ భక్తిచే, జీవితమును తరింపజేసికొనవలెను

## ప్రార్థన

శ్లో ॥ **వసుదేవ సుతం దేవం కంస చాణూర మర్దనమ్।**
**దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥**

భావము : వసుదేవుని సుతుడైన దేవుడు కంసుని, చాణూరుని మర్దించినవాడు. మాత దేవకికి పరమానందమును కలిగించినవాడు, జగత్తునకు గురువు అయిన శ్రీ కృష్ణ పరమాత్మకు నమస్కరించుచున్నాను.

శ్లో ॥ **ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే।**
**తమహం శిరసా వందే, రాజానం కులశేఖరమ్॥**

భావము · ఏ కులశేఖర రాజు యొక్క నగరమందు, ప్రతి దినము శ్రీ రంగ నగరయాత్రను గూర్చి చాటింపు జరుగుచుండెనో, అట్టి కులశేఖరునకు శిరస్సు వంచి నమస్కరించు చున్నాను.

శ్లో ॥ శ్రీ వల్లభేతి వరదేతి దయాపరేతి
భక్త ప్రియేతి భవలుంఠన కోవిదేతి।
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద॥ 1

భావము . ఓ ముకుంద! శ్రీ వల్లభ! వరద! దయాపర! భక్తప్రియ! భవలుంఠన కోవిద! (సంసార బంధమునకు చెందిన బాధలను పోగొట్టుటయందు నిపుణుడా!) నాథ! నాగశయన! (శేషుని శయ్యగా కలవాడా!) జగన్నివాసా! ఎల్లప్పుడు నీ నామమును మాటిమాటికి నేను ఆలాపించునట్లు చేయుమా!

శ్లో ॥ జయతు జయతు దేవో దేవకీనందనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశ ప్రదీపః।
జయతు జయతు మేఘ శ్యామలః కోమలాంగః
జయతు జయతు పృథ్వీ భారనాశో ముకుందః॥ 2

భావము · దేవుడు, దేవకీనందనుడు, కృష్ణుడు వృష్ణి వంశమును ప్రకాశింపజేసినవాడు; నీలి వన్నెకాడు, కోమలాంగుడు, పుడమి బరువును త్రుంచినవాడు, జయించుగాక!

శ్లో ॥ ముకుంద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవంత మేకాంత మియంత మర్థం।
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్॥ 3

భావము : ఓ ముకుంద! నీకు మ్రొక్కి! ఒకే యొక్క కోరికను ఇమ్మని ప్రార్థించుచున్నాను. నాకు అన్ని జన్మల యందు నీ పదకమలములందు నిశ్చలభక్తిని దయతో, కలిగింపుమా!

శ్లో ॥ నాహం వందే తవచరణయో ర్ద్వంద్వమద్వంద్వ హేతోః
కుంభీపాకం గురుమపి హరే నారకం నాపనేతుం।
రమ్యారామా మృదుతనులతా నందనే నాపిరంతుం
భావే భావే హృదయ భవనే భావయేయం భవంతం॥ 4

భావము : ఓ స్వామి! నీ చరణముల రెంటికి, ద్వంద్వముల నివృత్తికై (రాగద్వేషాదులు), గొప్ప నరకబాధ నివారణకై, నందనమందు మగువల కూరిమికై, నేను నమస్కరించుట లేదు. సతతము నిన్నే నా హృదయమందు ధ్యానించెదను.

శ్లో ॥ నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వ కర్మానురూపం।
ఏత త్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగ గతా నిశ్చలా భక్తి రస్తు॥ 5

భావము . ఓ భగవానుడ! ధర్మము, అర్థము, కామము అనువాని విషయమందు నాకు కోరిక లేదు పూర్వకర్మ ఫలములను అనుభవింపక తప్పదు నీ పాద కమలముల యెడ నాకు భక్తిని ప్రసాదింపుమా!

శ్లో ॥ దివి వా భువి వా మమాస్తు వాసో
నరకే వా నరకాంతక! ప్రకామం।
అవధీరిత శారదారవిందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి॥ 6

భావము : ఓ నరకాంతక! కృష్ణా! దివి, భువి, నరక లోకములందు ఎచ్చటనున్నను నాకు చింత లేదు. నీ అరవింద సదృశములగు అందమైన పాదాలను, మరణ సమయ మందైనను తప్పక ధ్యానించెదను.

శ్లో ॥ కృష్ణ! త్వదీయ పద పంకజ పంజరాంత
మద్యైవ మే విశతు మానస రాజహంసః।
ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే॥ 7

భావము : ఓ కృష్ణ! నా మనస్సు అనెడి రాజహంస ఇప్పుడే నీ పదపద్మము అనెడి పంజరమును చేరుగాక! ప్రాణములు పోవు కాలమందు కఫము, వాతము, పిత్తము అనువానిచే గొంతు మూతపడినప్పుడు, నేను ఎట్లు స్మరింపగలను?

శ్లో ॥ చింతయామి హరిమేవ సంతతం
మంద మంద హసితాననాంబుజం।
నందగోపతనయం పరాత్పరం
నారదాదిమునిబృంద వందితం॥ 8

భావము : చిఱునవ్వు చిందించు తామరపూవు మోమువాడు, నారదుడు మొదలగు ముని బృందముల మ్రొక్కులు కలవాడు, అన్నింటికంటె అధికుడు, నందగోప తనయుడును అయిన ఆ శ్రీహరిని సతతము ధ్యానించెదను.

శ్లో ॥ కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే
శ్రమముషిభుజవీచి వ్యాకులేஉగాధమార్గే।
హరిసరసివిగాహ్యాஉపీయ తేజోజలౌఘం
భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి॥ 9

భావము : హరి చేతులు పాదాలు అనెడి తామరపువ్వులు, కాంతిగల కన్నులు అనెడి చేపలు, భుజములు అనెడి అలలు, లోతును శ్రమను తీర్చునట్టిదియును, మంగళకరమును అయిన హరి అనెడి పేరుగల సరస్సునందు మునిగి, తేజస్సు అనెడి నీటి నంతయును త్రాగి, సంసారము అనెడి ఎడారిలో ఎండిన నేను నా తాపమును అంతము చేసికొందును.

శ్లో ॥ సరసిజనయనే సశంఖచక్రే
మురభిది మా విరమస్వ చిత్తరంతుం।
సుఖతర మపరన్న జాతు జానే
హరిచరణ స్మరణామృతేన తుల్యం॥ 10

భావము : ఓ మనసా! పద్మనయనుడు, శంఖుచక్రగదాధరుడు, మురహరుడు అగు శ్రీహరి చరణ స్మరణము అనెడి అమృత పాన సుఖమునకు సాటియైనది వేఱొక దానిని నేను ఎఱుగను (అట్టిది వేఱొకటి లేదని భావము).

శ్లో ॥ మాభీర్మందమనో! విచింత్య బహుధా యామీశ్చిరం యాతనాః
నాஉమీ నః ప్రభవంతి పాపరిపవ స్స్వామీ నను శ్రీధరః।
ఆలస్యం వ్యపనీయ భక్తి సులభం ధ్యాయస్వ నారాయణం
లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః॥ 11

భావము : ఓ మందమనసా! బహువిధ యమ యాతనలకు, మిక్కిలి చింతించి భయపడు కుము! పాపములు అనెడి శత్రువులు మనకు అపకారము చేయజాలవు! ఆ స్వామి లక్ష్మీవల్లభుడు ఆలస్యము చేయక భక్తికి సులభ వశుడగు శ్రీమన్నారాయ ణుని ధ్యానింపుము లోకుల ఆపదలను హరించి, ఆ హరి తన దాసుని కష్టాలను తొలగింపడా?

శ్లో ॥ **భవజలది గతానాం ద్వంద్వవాతా హతానాం**
**సుతదుహితృ కళత్రత్రాణ భారార్ధితానాం।**
**విషమవిషయ తోయే మజ్జతా మప్లవానాం**
**భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణాం॥** **12**

భావము : సంసారము అనెడి సముద్రమున పడిపోయిన వారిని, సుఖదుఃఖములు అనెడి వాతముచే (గాలిచే) నెట్టి వేయబడుచున్న వారిని, కుమారుడు, కుమార్తె, భార్య మొదలైన వారి రక్షణ భారముచే క్రుంగిన వారిని శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మొదలగు విషయములు అనెడి జలప్రవాహమందు మునుగుచు తేలుచు వానిని దాటుటకు పడవ లేక బాధలు చెందువారిని, రక్షించు నావ యొక్కటియే అదియే "విష్ణువు" అనెడి తెప్ప. ఆ భగవానుడే దాసులను కష్టాల నుంచి గట్టెకించు నౌక.

శ్లో ॥ **భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం**
**కథమహమితి చేతో మాస్మగాః కాతరత్వం।**
**సరసిజదృశి దేవే తావకీ భక్తి రేకా**
**నరకభిది నిషణ్ణా తారయిష్య త్యవశ్యం॥** **13**

భావము : ఓ మనస! సంసార సాగరము చాలా లోతైనది. దానిని ఎట్లు దాటగలనా? అని శంకింపకుమా! కమల నయనుడైన నరకాంతకుని యందు, నిలిచిన నీ భక్తి యొక్కటే నిన్ను ఆవలి దరికి చేర్చగలదు.

శ్లో ॥ **తృష్ణా తోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే**
**దారావర్తే తనయసహజ గ్రాహసంఘాకులే చ।**
**సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్**
**పాదాంభోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ॥** **14**

భావము : ఆశ అనెడి జలము, కామము అనెడి వాయువుచే రేగుచున్న మోహము (అజ్ఞానము) అనెడి అలలు, సతి అనెడి సుడి, సంతానము, సోదరులు అనెడి మొసళ్ల మొత్తము పీడించుచున్న సంసార సాగరమందు మునిగి తేలుచున్న మాకు ఓ త్రివిక్రమ! వరద! నీ పదకమలమందు భక్తి అనెడి పడవను ఇమ్ము.

**శ్లో ॥ మాద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తి హీనాన్ పదాబ్జే**
**మాశ్రౌషం శ్రావ్యబంధం తవ చరిత మపాస్యాన్యదాఖ్యాన జాతం।**
**మాస్మార్షం మాధవ! త్వా మపి భువనపతే! చేతసాఽపహ్నువానా**
**న్మాభూవం త్వత్సపర్యా వ్యతికర రహితో జన్మ జన్మాంతరేఽపి॥ 15**

భావము : ఓ మాధవ! భువనపతి! పుణ్యహీనులను, నీ పాదకమలములపై భక్తి లేని వారిని నేను చూడజాలను. నీ శ్రావ్యమైన కథలను మాత్రమే విందును నిన్ను కీర్తింపని వారిని తలంపను. ఇతర జన్మలయందు, నిన్ను సేవింపని జన్మ నాకు వలదు. అది మేలు చేయదు

**శ్లో ॥ జిహ్వే! కీర్తయ కేశవం, మురరిపుం చేతో! భజ, శ్రీధరం**
**పాణిద్వంద్వ! సమర్చ యాచ్యుతకథా శ్శ్రోత్రద్వయ! త్వం శృణు।**
**కృష్ణం లోకయ లోచనద్వయ! హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం**
**జిఘ్ర ఘ్రాణ! ముకుందపాద తులసీ మూర్ధన్! నమాఽధోక్షజం॥ 16**

భావము : ఓ నాలుకా! కేశవుని కీర్తింపుము ఓ చేతసా! (మనసు) మురారిని భజన చేయుము. ఓ కరద్వయమా! (చేతులు) శ్రీధరుని పూజింపుము. ఓ కర్ణద్వయమా! (చెవులు) అచ్యుతుని కథలను వినుము. ఓ లోచన ద్వయమా! (కన్నులు) శ్రీ కృష్ణుని దర్శించుము. ఓ పాదద్వయమా! హరి మందిరమునకు నడుపుము. ఓ నాసికా! ముకుందుని పాదములపై గల తులసిని వాసన చూడుము. ఓ శిరమా! గోవిందునికి నమస్కరింపుము.

**శ్లో ॥ హేలోకాః! శృణుత ప్రసూతి మరణ వ్యాధే శ్చికిత్సామిమాం**
**యోగజ్ఞా స్సముదాహరంతి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః**
**అంతర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం**
**తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికమ్!! 17**

భావము : ఓ లోకులారా! వినుడు. యోగులైన యాజ్ఞవల్క్యాది మునులు, జనన మరణ వ్యాధులకు చెప్పిన మందును వినుడు. మన ఆత్మలో వెలుగు కాంతిపుంజము 'కృష్ణుడు' అనెడి మందు అది మిక్కిలి గొప్పది. అది నిత్యానందమును ఇచ్చును.

శ్లో ॥ హే మర్త్యాః! పరమం హితం శ్రుణుత వోవక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మి బహుళం సమ్యక్ప్రవిశ్యస్థితాః!
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణా యేత్యముం
మంత్రం స ప్రణవం ప్రణామ సహితం ప్రావర్తయధ్వం ముహుః॥ 18

భావము : ఓ మానవులారా! మీకు మేలు చేయు మాట చెప్పెదను. ఆపదలు అనెడి అలలు గల సంసార సముద్రములో మునిగి తేలుచున్న మీరు నమ్మకముతో నారాయణుడే పరమాత్మ అని "నమో నారాయణ" అనెడి మంత్రమును ఓంకారపూర్వకముగా ధ్యానింపుడు.

పృథ్వీరేణురణుః పయాంసి కణికాః ఫల్గుస్ఫులింగో లఘుః
తేజో నిశ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః।
క్షుద్రా రుద్ర పితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురాః
దృష్టే యత్ర స తావకో విజయతే భూమాऽవధూతావధిః॥ 19

భావము భూమి చాలా చిన్న పొడిముక్క సముద్రము చిక్క చుక్క అగ్ని మండెడి చిన్న రవ్వ. వాయువు సన్నని ఊపిరి. ఆకసము సన్నని కన్నము. రుద్రుడు, బ్రహ్మ మొదలైనవారు అల్పులు. దేవతలు సన్నని పురుగులు ఓ దేవా! నీ మహత్వము పరిమితి లేనిదై ప్రకాశించుచున్నది

శ్లో ॥ బద్ధే నాంజలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా।
నిత్యం త్వచ్చరణారవింద యుగళ ధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్॥ 20

భావము : ఓ సరసిజాక్ష! (పద్మనయన) మోడ్చిన చేతులతో వాల్చిన తలతో, గగుర్పాటు చెందిన శరీరావయవములతో గద్గదమైన గొంతుతో వెలికి వచ్చు నీటి కన్నులతో నీ పాదకమలములను, ధ్యానించుచు, జీవితాంతము, ఆ ఆనందామృతమును పానము చేయునట్లు అనుగ్రహింపుము.

శ్లో ॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సింధు కన్యాపతే!
హే కంసాంతక! హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవ!
హే రామానుజ! హే జగత్రయగురో! హే పుండరీకాక్ష! మాం
హే గోపీజననాథ! పాలయ పరం జానామి త్వాం వినా॥ 21

భావము : ఓ గోపాలక! కృపాజలనిధీ! లక్ష్మీపతీ! కంసాంతకా! గజేంద్ర రక్షక! మాధవ! రామానుజా! (కృష్ణా) జగత్త్రయగురూ! పుండరీకాక్ష! గోపీజననాథా! నన్ను పాలింపుము. నిన్ను తప్ప మఱి యెవరిని ఎఱుగను.

శ్లో ॥ భక్తాపాయ భుజంగ గారుడ మణిఃత్రైలోక్య రక్షామణిః
గోపీలోచన చాతకాంబుదమణిః సౌందర్యముద్రామణిః।
యః కాంతామణి రుక్మిణీ ఘనకుచద్వంద్వైక భూషామణిః
శ్రేయో దేవశిఖామణిర్దిశతు నో గోపాల చూడామణిః॥ 22

భావము : భక్తుల అపాయములు అనెడి పాములకు గారుడమణి (రక్ష), త్రిలోకములకు రక్షామణి. గోపకన్నెల కన్నులు అనెడి చాతక పక్షులకు అంబుదమణి (మేఘము), అతిలోక సౌందర్యమునకు ముద్రామణి (సంకేతము-ముద్రయైనవాడు), ఉత్తమ కాంతులతో మణియైన రుక్మిణి ఉదరమునకు ప్రధానమైన భూషామణి, అందమైన అలంకారము దేవతలకు శిఖామణి (ఉన్నతుడు), గోపాలకులకు చూడామణి (అధికుడు) ఆ శ్రీ కృష్ణుడు మాకు మేలును కలిగించుగాక!

(మణి – విషము తొలగించు రత్న విశేషము. మణి-శ్రేష్ఠ వాచకము, మఱియు ఆభరణము.)

శ్లో ॥ శత్రుచ్ఛేదైక మంత్రం సకల ముపనిషద్వాక్య సంపూజ్య మంత్రం
సంసారోత్తార మంత్రం సముపచిత తమస్సంఘ నిర్యాణమంత్రం।
సర్వైశ్వర్యైక మంత్రం వ్యసన భుజగ సందష్టసంత్రాణ మంత్రం
జిహ్వే! శ్రీ కృష్ణ మంత్రం జప జప సతతం జన్మసాఫల్య మంత్రం॥ 23

భావము : ఓ నాలుకా! శత్రు నిర్మూలనము చేయునదియు, ఉపనిషత్తులచే అర్చించబడునది యును సంసారబంధ విముక్తిని ఇచ్చునదియును తెలివిలేమిని (అజ్ఞానమును) తొలగించునదియును, సమస్తములైన సంపదలను ఇచ్చునది, వ్యసనములు అనెడి

పాము కాట్ల నుండి కాపాడునదియును, పుట్టుకను సఫలముగా చేయునదియును అయిన "శ్రీకృష్ణ" అనెడి మంత్రమును నిత్యము జపించుము.

శ్లో ॥ వ్యామోహ ప్రశమౌషధం ముని మనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధం!
భక్తాత్యంతహితౌషధం భవ భయ ప్రధ్వంసనైకౌషధం
శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీ కృష్ణ దివ్యౌషధమ్॥ **24**

భావము . ఓ మనసా! విషయ మందు వాంఛను తగ్గించునదియును, మునుల మనస్సులను శుద్ధి చేసి, భగవంతునిపై మరల్చునదియును, రక్కసుల అక్కసు నడంచునదియును, మూడు లోకాలను ఉజ్జీవింపజేయునదియును, భక్తులకు మిక్కిలి మంచిని చేయు నదియును, సంసార భయమును పోగొట్టునదియును, మోక్షమును చేతికి అందిచ్చు నదియునైన, "శ్రీకృష్ణ" అనెడి దివ్యమైన ఔషధమును (మందును) త్రాగుము

శ్లో ॥ అమ్నాయాభ్యసనా న్యరణ్య రుదితం వేదవ్రతాన్యన్వహం
మేద శ్చేద ఫలాని, పూర్త విధయః సర్వే హుతం భస్మని
తీర్థానా మవగాహనాని చ గజ స్నానం వినాయత్పద
ద్వంద్వాంభోరుహ సంస్మృతీర్విజయతే దేవస్సనారాయణః॥ **25**

భావము : నారాయణ ధ్యానము లేని ధ్యానము అరణ్య రోదనము అట్లే వేదవ్రత నియమ పాలనము వ్యర్ధము. అట్లే ధర్మకార్య ప్రవర్తనము బూడిదలో హోమము చేయుట అగును మఱియు పవిత్ర నదులలో స్నానాలును ఏనుగు స్నానము వంటివే! అన్నియు నారాయణస్మరణము లేనిచో ఫలవంతములు కానేకావు. సదా నారాయణ స్మరణమే నిత్యము ప్రధమ కర్తవ్యము. ఆతడే ఆది దేవుడై వర్ధిల్లుచున్నాడు.

శ్లో ॥ శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం
కే న ప్రాపు ర్వాంఛితం పాపినోఽపి।
హా నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్
తేన ప్రాప్తం గర్భ వాసాది దుఃఖమ్॥ **26**

భావము : పాపులు ఎల్లరు "నారాయణ, నారాయణ" అని ఉచ్చరించుచు, తమ కోరికను పొందిరి అకటా! నేను, పూర్వము ఆ పవిత్ర నామోచ్చారణము చేయకపోవుటచే ఈ పుట్టుక సంసార కష్టముల అనుభవించుచున్నాను.

శ్లో ॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏషఏవ।
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాధ! ॥ 27

భావము : మధుకైటభ మర్దన! నా జన్మకు ఫలము నేను కోరునది యొక్కటియే! లోకనాధ! నీ దాసుల దాసులకు దాసుడని తలంపుము.

శ్లో ॥ నాధే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపేచేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి పరే నారాయణే తిష్ఠతి।
యం కంచి త్పురుషాధమం కతిపయ గ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూఢావరాకా వయం॥ 28

భావము : మనకు నాధుడు పురుషులలో ఉత్తముడు మూడు లోకాల్లో ప్రభువు, మనసుచే ధ్యానింపదగినవాడు, తన పదమును ఇచ్చువాడు. దేవుడును, శ్రీ మన్నారాయణుడు ఆధారముగా నుండగా కొద్ది గ్రామాలకు అధిపతియు అల్ప మాత్ర ధనము నిచ్చువాడు అగు అధముడైన నరుని తెలివి లేనివారమై సేవించుటకు, వెదకు కొనుచున్నాము ఆహా! మన మెంత అల్పులమో!

శ్లో ॥ మదన! పరిహార స్థితిం మదీయే
మనసి ముకుంద పదారవింద ధామ్ని।
హర నయన కృశానునా కృశోఽసి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః॥ 29

భావము : ఓ మదనుడా! ముకుంద పద పద్మములందు నిలిచిన నా మనస్సున నుండుటకు యత్నింపకుము. (నన్ను విడిచిపెట్టుము). పూర్వము, హరుని నయనాగ్నిచే కృశించి యున్నావు. మురారి సుదర్శన చక్ర ప్రభావము తలంపక యున్నావు. సుమా! జాగరూకుడవై ఉండుము.

శ్లో ॥ తత్వం బ్రువణాని పరంపరస్మాత్
మధుక్షరంతీవ సతాం ఫలాని।
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే!
నామాని నారాయణ గోచరాణి॥ 30

భావము : ఓ నాలుకా! ప్రకృతి కంటె పరమైన తత్త్వమును చెప్పుచున్నవియును సత్పురుషులకు మధురములగు మధువును (తేనెను) స్రవింపజేయు ఫలములైనవియు అగు నారాయణ తత్త్వమును తెలిపెడి ఆ నామములను జపింపుము. చేతులు మోడ్చి, ప్రార్థించుచున్నాను.

శ్లో ॥ **ఇదం శరీరం పరిణామ పేశలం**
**పత త్యవశ్యం శ్లథసంధి జర్ఝరం।**
**కి మౌషధైఃక్లిశ్యసి మూఢ! దుర్మతే!**
**నిరామయం కృష్ణ రసాయనం పిబ॥** **31**

భావము : ఓ మూఢ! (తెలివిలేనివాడు) దుర్మతీ! ఈ శరీరము మార్పు కలదై సంధులు సడలినదై, అవశ్యము పతనమగును. మందులు తినుచు ఏం కృశించెదవు? రోగాలను రానీయని శ్రీకృష్ణ నామ రసాయనమును పానము చేయము.

శ్లో ॥ **దారా వారాకర వరసుతా తే తనూజో విరించిః**
**స్తోతా వేద స్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః**
**ముక్తి ర్మాయా జగ దవికలం తావకీ దేవకీ తే**
**మాతా మిత్రం బలరిపు సుతః త్వయ్యతోఽన్య న్నజానే॥** **32**

భావము : ఓ కృష్ణా! సముద్రతనయ లక్ష్మి, నీ సతి, విరించి నీ సుతుడు. వేదము నీ స్తోత్ర పారకుడు. దేవతలు నీ సేవకులు. నీ అనుగ్రహమే నాకు మోక్షము. నీ మాయమే, ఈ సత్యముగా కన్పట్టు జగత్తు. నీ మాత దేవకీ దేవి. నీ సఖుడు అర్జునుడు. వారి కంటె ఇతరులను నేను ఎఱుగును.

శ్లో ॥ **కృష్ణే రక్షతు నో జగత్రయ గురుః కృష్ణం నమస్యామ్యహం**
**కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః ।**
**కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం**
**కృష్ణేతిష్ఠతి విశ్వ మేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్॥** **33**

భావము : కృష్ణుడు (ప్రథమ) మూడు లోకాలకు గురువు మమ్ము రక్షించుగాక! నేను కృష్ణుని గూర్చి (ద్వితీయ) నమస్కరించుచున్నాను. శ్రీ కృష్ణుని చేత (తృతీయ) దేవతల శత్రువులు రాక్షసులు నిహతులైరి. అట్టి కృష్ణునికై (చతుర్థి) నమస్కారము. కృష్ణుని వలన (పంచమి) జగము జనించినది. అట్టి కృష్ణునకు (షష్ఠి) నేను దాసుడను.

జగత్ స్వరము, కృష్ణుని యందు (సప్తమి) నిలిచియున్నది. ఓ కృష్ణా! రక్షింపుమా! ఈ శ్లోకమందు శ్రీ కృష్ణ శబ్దము అన్ని విభక్తులలో ప్రయోగింపబడినది

శ్లో ॥ తత్త్వం ప్రసీద భగవన్! కురుమయ్యనాథే
విష్ణో కృపాం పరమ కారుణికః కిల త్వం।
సంసార సాగర నిమగ్న మనంతం దీన
ముద్ధర్తుమర్హసి హరే! పురుషోత్తమోఽసి॥ 34

భావము . ఓ భగవాన్! నీవు నాథుడులేని నా యందు ప్రసన్నుడవు కమ్ము ఓ విష్ణూ! నీవు దయామయుడవు కదా! అనంత! సంసార సాగరమందు మునిగియున్న దీనుడైన నన్ను నీవే పైకి లాగి వేయగలవు ఓ హరీ! నీవే పురుషులలో ఉత్తముడవు

శ్లో ॥ నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజనం సదా।
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వ మవ్యయమ్॥ 35

భావము : నారాయణ పాద పద్మములను గూర్చి నమస్కరింతును. సదా నారాయణుని పూజింతును. నిర్మలమైన నారాయణ నామమును నిత్యమైన నారాయణతత్త్వమును స్మరింతును.

శ్లో ॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
శ్రీకృష్ణ! భక్త ప్రియ! చక్రపాణే! ।
శ్రీ పద్మనాభాచ్యుత! కైట భారే!
శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! ॥ 36

భావము : ఓ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణి! శ్రీ పద్మనాభ! అచ్యుత! కైటభారి! శ్రీరామ! పద్మాక్ష! హరీ! మురారీ!

శ్లో ॥ అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ!
గోవింద! దామోదర! మాధవేతి।
వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చిత్
అహో! జనానాం వ్యసనాభిముఖ్యం॥ 37

భావము ఓ అనంత! వైకుంఠ! ముకుంద! కృష్ణ! గోవింద, దామోదర! మాధవ అని దేవుని పేర్లను పలుకుటకు నోరుండియు, నోటిని కదిలించుట లేదు. అకటా లోకులకు వారి వ్యసనములందే ఆసక్తి యున్నదే! భగవచ్చింత ఏల కలుగుటలేదో!

శ్లో ॥ ధ్యాయంతి యే విష్ణుమనంత మవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితం
సమాహితానాం సతతాఽభయప్రదం
తే యాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవమ్॥ 38

భావము · విష్ణువును (సర్వవ్యాప్తి) అంతము లేని వానిని, మార్పు లేని వానిని, హృదయ కమలమందు నిలిచిన వానిని మననము చేయు వారి భయమును తొలగించు వానిని, ధ్యానించు వారెల్లరు విష్ణువు యొక్క పరమ పదమును పొందెదరు.

శ్లో ॥ క్షీరసాగర తరంగ శీకరాఽఽ
సారతారకిత చారుమూర్తయే।
భోగిభోగశయనీయశాయినే
మాధవాయ మధు విద్విషే నమః॥ 39

భావము · పాలకడలి అలల నీటి బిందువులు, తన నల్లని శరీరముపై, మబ్బులపై నక్షత్రము వలె మినుకు మినుకుమని వెలుగుచుండగా, ఆదిశేషుని పాన్పుపై పవళించిన, మధువను పేరుగల రాక్షస సంహారియగు మాధవునకు నమస్కారము

శ్లో ॥ యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మ వరపద్మశరావభూతాం
తే నాంబుజాక్ష చరణాంబుజ షట్పదేన
రాజ్ఞాకృతా కృతిరియం కులశేఖరేణ॥ 40

భావము : వేదవిదులు కవిలోకములో వీరులు, వాల్మీకి (ద్విజన్మవర), నమ్మాళ్వారు (పద్మశర) అనెడి వారు మిత్రులైన వాడును, పుండరీకాక్ష పాదపద్మములందు పరిభ్రమించు భ్రమరమును (తేనెటీగ) అయిన శ్రీ కులశేఖర మహారాజుచే 'ముకుందమాల' అనెడి ఈ కృతి నిర్మింపబడినది.

# శ్రీ విల్లి పుత్తూరు (శ్రీ ధన్వి నవ్యపురము)

శ్రీమాన్ ఆచార్యులవారు, శ్రీవిల్లి పుత్తూరును 'శ్రీ ధన్వి నవ్యపురము' అన్నారు. చక్కని అనుసృజనము. శ్రీమతి ఆండాలు, శ్రీమాన్ పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) ఇరువురును జనన మొందిన పవిత్ర ప్రదేశం శ్రీవిల్లి పుత్తూరు. వైష్ణవ క్షేత్రాలలో అగ్రగణ్యమై ఆదరింప బడుచున్నది. కారణమేమనగా, పన్నిద్దరు ఆళ్వారులలో ఇద్దరు జన్మించిన స్థలం. విశేషించి మానవకాంత ఆండాళ్ (గోదాదేవి), తాను వలచి, శ్రీరంగనాథుని భర్తగా పొందిన పుణ్యదేశం. అందువలననే శ్రీ విల్లి పుత్తూరు అధికాదరణ పొందినది

శ్రీ విల్లి పుత్తూరులో "ఆండాళ్-రంగమన్నారు వటపత్రశాయి" దేవాలయం మఱియు దేవాలయ ద్వయ సముదాయం (twin temple complex) మూడేళ్లకు ముందు రెండున్నర కోట్ల రూపాయల ఖర్చుతో, దాతలచే ఉద్ధరింపబడింది. వటపత్రశాయి ఆలయం, సుమారు 196 అడుగుల ఎత్తుగల గోపురంతో అత్యంత ఆకర్షణీయంగా సాక్షాత్కరిస్తుంది. పాండ్యరాజు వల్లభదేవుడు నిర్మించాడు. కంబర్ కవిచక్రవర్తి దానిని మేరుపర్వతముతో పోల్చి గానం చేసినాడు. తమిళనాడు ప్రభుత్వం "ఆండాళు-రంగమన్నారు" దేవాలయాన్ని ప్రభుత్వ ముద్రగా ఆదరిస్తున్నది. శ్రీవిల్లిపుత్తూరులో ఆండాళ్ తన తిరుప్పావై - ముప్పది పాశురములచే ఆర్చించిన ధామం. తమిళులకు, తెలుగువారికి అందరికి ఆరాధనీయమై అలరారుచున్నది. భారతదేశంలో ఉన్న శ్రీవిల్లిపుత్తూరు ఆలయానికి అన్ని దేవాలయాల వలె భూస్థితి వెయ్యిఎకరాల సాగు భూమి ఉన్నా, వానివల్ల ఏ మాత్రం ఆదాయం లేని పరిస్థితిలో దయనీయమై ఉన్నది. దేవుని సొమ్మంతా కౌలుదారి సొమ్మే.

ఆండాళ్, తిరుమలేశుని (తిరుపతి), అళగర్ (మధుర) స్వామిని ఆరాధించిన భక్తురాలు ఆమె పేరుతో ఇప్పటికి పురటాసినెలలో గరుడోత్సవకాలంలో తిరుమల స్వామివారికి, చిత్ర పౌర్ణమినాడు అళగర్ స్వామివారికి పూలమాలలు అర్పిస్తారు

వైష్ణవాచార్యులు ఎందరో వటపత్రశాయిని దర్శించారు. దేవాలయంలో శిల్పసంపద, ప్రాచీన భారతీయ సంస్కృతిని చక్కగా చాటుతుంది. కన్నుల పండువుగా, దేవాలయ రథం, కోనేరు దర్శనీయాలై ఉన్నవి. కోనేరు (తీర్థము) పేరు తిరుముక్కుళమ్.

దాతలచే, తమిళనాడు ప్రభుత్వంచే ఉద్ధరింపబడి, అలంకృతమైన దేవాలయ ఉద్ధర ణోత్సవం ఫిబ్రవరి నెల 10వ తేదీ, 2000 సంవత్సరం నిర్వహింపబడింది. ఆ సందర్భంగా 23వ తేదీ జనవరి 2000 సం॥ "ది హిందూ" ఆంగ్ల దినపత్రిక శ్రీ టి.ఏ.శ్రీనివాసన్ నివేదికతో ప్రముఖంగా దేవాలయ గోపురం, ఆండాళ్ రంగమన్నారు విగ్రహాల చిత్రపటాలను ప్రచురించింది.

*(ఈ పై మాటలకు హిందూ పత్రికవారి సౌజన్యమే ఆధారం.)*

# తిరుప్పావై

మార్గళిత్తిజ్గల్ మదినిఱైన్ద నన్నాళాల్ *
నీరాడప్పోదువీర్ పోదుమినో నేరిళైయీర్! *
శీర్మల్గుం ఆయ్ప్పాడి శెల్వ చ్చిఱుమీర్కాళ్! *
కూర్వేల్ కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్ *
ఏరార్న్దకణ్ణి యశోదై యిళంశింగం *
కార్ మేని చ్చెజ్గల్ కదిర్ మదియంబోల్ ముగత్తాన్ *
నారాయణనే నమక్కే పఱై తఱువాన్ *
పారోర్ పుగళప్పడిన్దేలోరెమ్బావాయ్ * 1

వైయత్తు వాళ్వీర్గాళ్! నాముం నంపావైక్కు *
శెయ్యుం కిరిశైగళ్ కేళీరో * పార్కడలుళ్
పైయత్తుయిన్ఱ పరమనడి పాడి *
నెయ్యుణ్ణోం పాలుణ్ణోం నాట్కాలే నీరాడి *
మైయిట్టెళుదోం మలరిట్టు నాం ముడియోమ్ *
శెయ్యాదన శెయ్యోం తీక్కురళై చ్చెన్ఱోదోమ్ *
ఐయముం పిచ్చైయుం ఆన్దనైయుం కైకాట్టి *
ఉయ్యుమాఱెణ్ణి ఉగన్దేలోరెమ్బావాయ్ 2

* ఓఙ్గియులగళన్ద ఉత్తమన్ పేర్పాడి *
నాఙ్గల్ నం పావైక్కు చ్చాత్తి నీరాడినాల్ *
తీఙ్గిన్ఱి నాడెల్లాం తింగళ్ ముమ్మారిపెయ్దు *
ఓఙ్గు పెరుం శెన్నె లూడు కయలుగళ *
ప్పూఙ్గువళై ప్పోదిల్ పొఱివణ్డు కణ్పడుప్ప *
తేఙ్గాదే పుక్కిరిన్దు శీర్త్తములై పత్రి *
వాఙ్గ కుడం నిఱైక్కుం వళ్ళల్ పెరుమ్పశుక్కళ్ *
నీఙ్గాద శెల్వం నిఱైన్దేలోరెమ్బావాయ్ 3

ఆళిమళైకణ్ణా! ఒన్ఱు నీ కైకరవేల్ *
ఆళియుల్ పుక్కు ముగన్దు కొడు ఆర్తేఱి *
ఊళిముదల్వ నురువమ్బోల్ మెయ్కఱుత్తు *
పాళియన్దోళుడై ప్పఱ్బనాబన్ కైయిల్ *
ఆళిపోల్ మిన్ని వలమ్బురిపోల్ నిన్ఱదిర్న్దు *
తాళాదే శార్ఙ్గ ముదైత్త శరమళై పోల్ *
వాళ ఉలగినిల్ పెయ్దిడాయ్ నాఙ్గళుమ్
మార్గళి నీరాడ మగిళాన్దేలోరెమ్బావాయ్. 4

మాయనై మన్ను వడమదురై మైన్దనై *
తూయ పెరునీర్ యమునై త్తుఱైవనై *
ఆయర్ కులత్తినిల్ తోన్ఱుం మణివిళక్కై *
తాయై క్కుడల్ విళక్కం శెయ్ద దామోదరనై *
తూయోమాయ్ వన్దునాం తూమలర్ తూవిత్తొళుదు *
వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క *

పోయపిళ్లైయుం పుగుదరువా నిన్డనవుమ్ *
తీయినిల్ తూశాగుం శెప్పేలోరెమ్బావాయ్ 5

పుళ్లుం శిలమ్బి నగాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్ *
వెళ్ళైవిళిశఙ్గిన్ పేరరవం కేట్టిలైయో? *
పిళ్ళాయ్ ఎళున్దిరాయ్ పేయ్ములై నంజుణ్డు *
కళ్ళచ్చుగడం కలక్కళియ క్కాలోచ్చి *
వెళ్ళత్తరవిల్ తుయిలమర్న్ద విత్తినై *
ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్గళుం యోగిగళుమ్ *
మెళ్ళ వెళున్దు అరి యెన్డ పేరరవమ్ *
ఉళ్ళం పుగున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్. 6

కీశుకీశెన్డు ఎఙ్గుం ఆనై చ్చాత్తన్ కలన్దు
పేశిన పేచ్చరవం కేట్టిలైయో? పేయ్ప్పెణ్ణే! *
కాశుం పిరప్పుం కలగలప్ప క్కై పేరు *
వాశ నఱుఙ్కుళలాయ్చ్చియర్ మత్తినాల్
ఓశై పడుత్త తయిరఱవం కేట్టిలైయో? *
నాయగప్పెణ్ పిళ్ళాయ్! నారాయణన్ మూర్తి *
కేశవనై ప్పాడవుం నీ కేట్టే కిడత్తియో? *
తేశముడైయాయ్! తిఱవేలోరెమ్బావాయ్ 7

కీళ్వానం వెళ్ళెన్డు ఎరుమై శిఱువీడు *
మేయ్వాన్ పరన్దనకాణ్ మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్ *
పోవాన్ పోగిన్డారై ప్పోగామల్ కాత్తు ఉన్నై

కూవువాన్ వన్దునిన్డ్రోం* కోదుకలముడైయ
పావాయ్! ఎళున్దిరాయ్ పాడి ప్పఱై కొణ్డు *
మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ *
దేవాదిదేవనై చ్చెన్ఱు నాం శేవిత్తాల్ *
ఆవా వెన్ఱారాయ్ న్దరుళేలోరెమ్బావాయ్. 8

తూమణి మాడత్తు శుత్తుం విళక్కెరియ *
తూపం కమళత్తుయిలణై మేల్ కణ్వళరుమ్ *
మామాన్ మగళే! మణిక్కదవం తాళ్ తిఱవాయ్ *
మామీర్! అవళై యెళుప్పీరో?* ఉన్ మగళ్ దాన్
ఊమైయో? అన్ఱి చ్చెవిడో? అనన్దలో? *
ఏమ ప్పెరున్దుయిల్ మన్దిర ప్పట్టాళో? *
మామాయన్ మాదవన్ వైగున్ద నెన్ఱెన్ఱు *
నామం పలవుం నవిన్ఱేలోరెమ్బావాయ్. 9

నోత్తుచ్చువర్కమ్ పుగుగిన్ఱ వమ్మనాయ్! *
మాత్తముం తారారో? వాశల్ తిఱవాదార్ *
నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్ *నమ్మాల్
పోత్త ప్పఱై తరుం పుణ్ణియనాల్ * పణ్డు ఒరునాళ్
కూత్తత్తిన్ వాయ్‌విళన్ద కుమ్బకరణనుమ్ *
తోత్తుం ఉనక్కే పెరున్తుయిల్ తాన్ తన్దానో *
ఆత్త వనన్దలుడై యాయ్! అరుఙ్గలమే! *
తేత్త మాయ్ వన్దు తిఱవేలోరెమ్బావాయ్. 10

కత్తుక్కఱవై క్కణఙ్గళ్ పలకఱన్దు *
శెత్తార్ తిఱలళియ చ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్ *
కుత్తమొన్ఱిల్లాద కోవలర్ దం పొఱ్కొడియే! *
పుత్తరవల్ గుల్ పునమయిలే! పోదరాయ్ *
శుత్తత్తుత్తోళిమా రెల్లారుం వన్దు* నిన్
ముత్తం పుగున్దు ముగిల్వణ్ణన్ పేర్ పాడ.
శిత్తాదే పేశాదే శెల్వప్పెణ్డాట్టి! * నీ
ఎత్తుక్కుఱఙ్గుం పొరుళేలోరెమ్బావాయ్ 11

కనైత్తిళం కత్తెరుమై కన్ఱుక్కిరఙ్గి *
నినైత్తు ములై వళియే నిన్ఱు పాల్ శోర *
ననైత్తిల్లం శేఱాక్కుం నఱ్చెల్వన్ తఙ్గాయ్! *
పనిత్తలై వీళనిన్ వాశల్ కడై పత్తి *
శినత్తినాల్ తెన్నిలంగై క్కోమానై చ్చెత్త *
మనత్తుక్కినియానై ప్పాడవుం నీవాయ్ తిఱవాయ్
ఇనిత్తా వెళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్! *
అనైత్తిల్లత్తారుం అఱిన్దేలోరెమ్బారాయ్. 12

పుళ్ళిన్ వాయ్ కీణ్డానై పొల్లా అరక్కనై *
కిళ్ళిక్కళైన్దానై క్కీర్తిమై పాడిప్పోయ్ *
పిళ్ళైగ ళెల్లారుం పావైక్కళం బుక్కార్ *
వెళ్ళి యెళున్దు వియాళు ముఱఙ్గిత్తు *
పుళ్ళుం శిలమ్బినగాణ్ పోదరిక్కణ్ణినాయ్ *
కుళ్ళక్కుళిర క్కుడైన్దు నీరాడాదే *

పళ్ళిక్కిడత్తియో? పావాయ్! నీ నన్నాళాల్ *
కళ్ళం తవిర్న్తు కలన్దేలోరెమ్బావాయ్. 13

ఉజ్గల్ పుళైక్కడై తోట్టత్తు వావియుళ్ *
శెజ్గళునీర్ వాయ్ నెగిళిన్దు ఆమ్బల్ వాయ్ కూమ్బినగాణ్ *
శెజ్గల్ పొడిక్కూత్తై వెణ్పల్ తవత్తవర్ *
తజ్గల్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోగిన్ఱార్ *
ఎజ్గలై మున్నం ఎళప్పువాన్ వాయ్ పేశుమ్ *
నజ్గాయ్! ఎళు న్దిరాయ్! నాణాదాయ్! నావుడై యాయ్! *
శజ్గొడు శక్కరమేన్దుం తడక్కైయన్ *
పజ్గయక్కణ్ణానై ప్పాడేలోరెమ్బావాయ్ 14

ఎల్లే! ఇళజ్గిళియే! ఇన్నం ఉఱజ్గుదియో! *
శిల్లెన్ఱళై యేన్మిన్! నంగై మీర్! పోదరుగిన్ఱేన్ *
వల్లై ఉన్ కట్టురైగళ్ పణ్డే ఉన్ వాయఱిదుమ్ *
వల్లీర్గళ్ నీజ్గళే నానేదా నాయిడుగ *
ఒల్లై నీ పోదాయ్ ఉనక్కెన్న వేఱుడైయై *
ఎల్లారుం పోన్దారో పోన్దారో? పోన్దెణ్ణిక్కొళ్ *
వల్లానై కొన్ఱానై మాత్తారై మాత్తళిక్క
వల్లానై* మాయనై ప్పాడేలోరెమ్బావాయ్ 15

నాయగనాయ్ నిన్ఱ నన్దగోపనుడై య *
కోయిల్ కాప్పానే! కొడితోన్ఱుం తోరణ *
వాశల్! కాప్పానే! మణిక్కదవంతాళ్ తిఱవాయ్ *

ఆయర్ శిఱుమియరో ముక్కు అఱై పఱై *
మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్‌నేర్‌న్దాన్ *
తూయోమాయ్‌వన్దోం తుయిలెళ ప్పాడువాన్ *
వాయాల్ మున్నం మున్నం మాత్తాదే అమ్మా! నీ *
నేశనిలైక్కదవం నీక్కేలోరెమ్బావాయ్. 16

అమర్బమే తణ్ణీరే శోరే అఱఙ్శెయ్యుమ్ *
ఎమ్బెరుమాన్! నన్దగోపాలా! ఎళు న్దిరాయ్! *
కొమ్బనార్కెల్లాం కొళున్దే! కులవిళక్కే! *
ఎమ్బెరుమాట్టి! యశోదాయ్! అఱివుఱాయ్ *
అమ్బరమూడఱుత్తుఓఙ్గి ఉలగళన్ద *
ఉమ్బర్ కోమానే! ఉఱఙ్గాదు ఎళున్దిరాయ్ *
శెమ్బొఱ్కళలడి చ్చెల్వా! బలదేవా! *
ఉమ్బియుం నీయుం ఉఱఙ్గేలోరెమ్బావాయ్. 17

ఉన్దు మదగళిత్తన్ ఓడాదతోళ్ వలియన్ *
నన్దగోపాలన్ మరుమగళే! నప్పిన్నాయ్! *
కన్దఙ్మమళం కుళలీ! కడై తిఱవాయ్ *
వన్దు ఎఙ్గుం కోళియళైత్తనగాణ్* మాదవి
ప్పన్దల్ మేల్ పల్‌కాల్ కుయిలినఙ్గల్ కూవినగాణ్
పన్దార్‌విరలి! ఉన్‌మైత్తునన్ పేర్‌పాడ *
శెన్దామరైక్కైయాల్ శ్రీరార్ వళై యొలిప్ప *
వన్దు తిఱవాయ్ మగిళాన్దేలోరెమ్బావాయ్ 18

కుత్తువిళక్కెరియ క్కోట్టుక్కాల్ కట్టిల్ మేల్ *
మెత్తెన్ఱ పఞ్చశయనిత్తిన్ మేలేఱి *
కొత్తలర్ పూఙ్గుళల్ నప్పిన్నై కొంగైమేల్ *
వైత్తుక్కిడన్ద మలర్మార్పా! వాయ్తిఱవాయ్! *
మైత్తడఙ్గణ్ణినాయ్! నీ ఉన్ మణాళనై *
ఎత్తనై పోదుం తుయిలెళ వొట్టాయ్‌గాణ్ *
ఎత్తనై యేలుం పిరివాత్త గిల్లాయాల్ *

19

ముప్పత్తు మూవర్ అమరర్కు మున్ శెన్ఱు *
కప్పం తవిర్కుం కలియే! తయిలెళాయ్ *
శెప్పముడైయాయ్! తిఱలుడై యాయ్!* శెత్తార్కు
వెప్పం కొడుక్కుం విమలా! తుయిలెళాయ్ *
శెప్పన్న మెన్ములై చ్చెవ్వాయ్ చ్చిరుమరుఙ్గుల్ *
నప్పిన్నై నఙ్గాయ్! తిరువే! తుయిలెళాయ్! *
ఉక్కముం తట్టొళియుం తన్దు ఉన్ మణాళనై *
ఇప్పోదే ఎమ్మై నీరాట్టేలోరెమ్బావాయ్. 20

ఏత్తకలఙ్గల్ ఎదిర్‌పొఙ్గి మీదళిప్ప *
మాత్తాదే పాల్ శొరియుం వళ్ళల్ పెరుం పశుక్కళ్
ఆత్తప్పడైత్తాన్ మగనే! అఱివుఱాయ్ *
ఊత్తముడైయాయ్! పెరియాయ్! ఉలగినిల్ *
తోత్తమాయ్‌నిన్ఱ శుడరే! తుయిలెళాయ్ *
మాత్తార్ ఉనక్కు వలితొలైన్దు ఉన్ వాశఱ్కణ్ *

ఆత్తాదు వన్దు ఉన్నడిపణియు మాపోలే *
పోత్తి యాం వన్దోం పుగళన్దేలోరెమ్బావాయ్. 21

అఙ్గణ్మాఞాలత్తరశర్ అబిమాన *
బఙ్గమాయ్ వన్దు నిన్ పళ్ళిక్కట్టిఱ్కళే *
శఙ్గమిరుప్పార్ పోల్ వన్దు తలై ప్పెయ్దోమ్ *
కిఙ్గిణి వాయ్చ్చెయ్ద తామరై ప్పూప్పోలే *
శెఙ్గణ్ శిఱిచ్చిఱిదే ఎమ్మేల్ విళియావో? *
తిఙ్గళుం ఆదిత్తియనుం ఎళున్దాఱ్పోల్ *
అఙ్గిణిరణ్డుం కొణ్డు ఎఙ్గల్ మేల్ నోక్కుదియేల్ *
ఎఙ్గళ్ మేల్శాబం ఇళిన్దేలోరెమ్బావాయ్. 22

మారిమలై ముళఞ్జిల్ మన్ని క్కిడన్దుఱఙ్గుమ్ *
శీరియ శిఙ్గం అఱివుత్తు త్తీవిళిత్తు *
వేరి మయిర్పొఙ్గ ఎప్పాడుం పేర్న్దుదఱి *
మూరి నిమిర్న్దు ముళఙ్గి ప్పుఱప్పట్టు *
పోదరుమాపోలే నీ పూవై ప్పూవణ్ణా! * ఉన్
కోయిల్ నిన్ఱుం ఇఙ్గనే పోన్దరుళి* కోప్పుడైయ
శీరియ శిఙ్గాసనత్తు ఇరున్దు* యాంవన్ద
కారియ మారాయ్న్దరుళేలోరెమ్బావాయ్. 23

*అన్ఱు ఇవ్వులగం అళన్దాయ్! అడిపోత్తి *
శెన్ఱఙ్గు త్తెన్నిలంగై శెత్తాయ్! తిఱల్ పోత్తి *
పొన్ఱ చ్చగడం ఉదైత్తాయ్! పుగళ్పోత్తి *
కన్ఱుకుణిలా వెఱిన్దాయ్! కళల్పోత్తి *

కున్జుకుడైయా ఎడుత్తాయ్! గుణం పోత్తి *
వెన్జుపగై కెడుక్కుం నిన్ కైయిల్ వేల్ పోత్తి *
ఎన్టైన్జు మ్ శేవగమే ఏత్తి ప్పఱై కొళ్వాన్ *
ఇన్జుయాం వన్దోం ఇరఙ్గేలోరెమ్బావాయ్. 24

ఒరుత్తి మగనాయ్ ప్పిఱన్దు. ఓరిరవిల్ *
ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర *
తరిక్కిలానాగి త్తాన్ తీఙ్గు నినైన్ద *
కరుత్తై ప్పిళైప్పిత్తు కఞ్జన్ వయిత్తిల్ *
నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే! * ఉన్నై
అరుత్తిత్తు వన్దోం పఱై తరుదియాగిల్ *
తిరుత్తక్క శెల్వముం శేవగముం యామ్పాడి *
వరుత్తముం తీర్న్దు మగిళ్న్దేలో రెమ్బావాయ్ 25

మాలే! మణివణ్ణా! మార్గళి నీరాడువాన్ *
మేలై యార్ శెయ్వనగళ్ వేణ్డువన కేట్టియేల్
ఞాలత్తై యెల్లాం నడుఙ్గ మురల్వన *
పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్చశన్నియమే *
పోల్వన్ శఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడై యనవే *
శాల ప్పెరుం పఱైయే పల్లాణ్డిశైప్పారే *
కోళ విళక్కే! కొడియే వితానమే! *
ఆలినిలైయాయ్! అరుళేలోరెమ్బావాయ్. 26

*కూడారై వెల్లుం శీర్ గోవిన్దా!* ఉన్ దన్నై
ప్పాడి ప్పఱై కొణ్డు యాం పెరు శమ్మానమ్ *

నాడు పుగళమ్గై పరిశినాల్ నన్గాగ *
శూడగమే తోళ్వళైయే తోడే శెవిప్పూవే *
పాడగమే యెన్ఱనైయ పల్కలనుం యామణివోమ్ *
ఆడై యుడుప్పోం అదన్పిన్నే పాల్ శోఱు *
మూడ నెయ్పెయ్దు ముళంగై వళివార *
కూడి యిరున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్ 27

కఱవైగళ్ పిన్ శెన్ఱు కానం శేర్న్దుణ్బోమ్ *
అఱివొన్ఱు మిల్లాద ఆయ్కులత్తు* ఉన్దన్నై
ప్పిరవిపెరున్దనై పుణ్ణియం యాముడై యోమ్ *
కుఱైవొన్ఱుమిల్లాద కోవిన్దా!* ఉన్దన్నోడు
ఉరవేల్ నమక్కు ఇఙ్గు ఒళిక్క ఒళియాదు *
అఱియాద పిళ్ళైగళోం అన్బినాల్* ఉన్దన్నై
చ్చిఱు పేరళైత్తనవుం శీరియరుళాదే *
ఇఱైవా! నీతారాయ్ పఱై యేలోరెమ్బావాయ్ 28

శిత్తం శిఱుకాలే వన్దు ఉన్నై చ్చేవిత్తు * ఉన్
పొత్తామరై యడియే పోట్రుం పొరుళ్ కేళాయ్*
పెత్తం మేయ్ త్తుణ్ణుం కులత్తిల్ పిఱన్దు*నీ
కుత్తేవల్ ఎఙ్గళై కొళ్ళామల్ పోగాదు*
ఇత్తైప్పఱై కొళ్వా నన్ఱుగాణ్ గోవిన్దా!*
ఎత్తైక్కుం ఏళేళు పిఱవిక్కుం * ఉన్దన్నోడు
ఉత్తోమే యావోం ఉనక్కే నామాళ్శెయ్వోమ్ *
మత్తై నఙ్గామఙ్గళ్ మాత్తైలోరెమ్బావాయ్. 29

*వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై *
త్తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిళైయార్ శెన్ఱిఱైఞ్జి *
అఙ్గప్పఱైకొణ్డ వాత్తై *అణిపుదువై
ప్పైఙ్గమలత్తణ్డెరియల్ ప్పట్టర్ పిరాన్ కోదై శొన్న *
శఙ్గత్తమిళ్మాలై ముప్పదుం తప్పామే *
ఇఙ్గు ఇప్పరిశురైప్పార్ ఈరిరణ్డు మాల్వరై త్తోళ్ *
శెఙ్గణ్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్ *
ఎఙ్గుం తిరువరుళ్ పెత్తు ఇన్బుఱువరెమ్బావాయ్? 30

## "ఏలోరెమ్బావాయ్"

ఈ పదబంధము – 29 పాశురాలలో ఉన్నది. 30వ పాశురంలో "ఎమ్బావాయ్" అని మాత్రమే ఉన్నది వ్యాఖ్యాతలు దీనికి "ఇది మా వ్రతము" అని మాత్రమే అర్థము తెల్పిరి ఇది ఉత్తర్ధ భాగానికి అర్థమే! కనుక పూర్వభాగానికి అర్థమును విచారింపవలెను ఏల్+ఓర్

"ఏల్"లో లకారము, గౌరవవాచకము ఇక్ష్వాకుల శాసనాలలో ఒకచోట "ఏలి ఎహువుల దానంనక" అని ఉన్నది. అనగా, "ఏలి ఎహువుల దాసుడు" అని అర్థము ఇది ఒక రాజకుమారుని పేరు.

ఏలి (స్త్రీవాచకము) ఎహువుల (పురుషవాచకము). ఇవి రెండును దేశ్యపదాలు, రెండవ మూడవ శాతాబ్దాలలో వ్యాప్తిలో నుండినవి దేవీ, దేవతామూర్తులను స్ఫురింప జేయు పదాలు. ఏలిక, ఏలేశ్వరుడు ప్రసిద్ధ పదాలు. ప్రభువు లేదా నాధుడు అని అర్థము. విజయపురి ఇక్ష్వాకుల రాజధానిలో (నాగార్జునసాగర్) "ఏలేశ్వరుడు" – పూజింపబడినాడు. ఇందులో "ఎహువుల" గర్భితమై యున్నది. ఓర్ = ఎల్లకాలము ఇది ఆంగ్ల ఎవర్ (ever)కు సమానార్థకము (ఓరంత ప్రొద్దు, శబ్దరత్నాకరము). కనుక ఏలోరెమ్బావాయ్ అనే పదబంధానికి అర్థము "ఓ దేవా! ఎల్లకాలము మా వ్రతము ఇది".

– (తెలుగు మరుగులు, 1992)

# తిరుప్పావై

**"తిరుప్పావై",** ముప్పది పాశురములు (కీర్తనలు) కల దివ్యప్రబంధము. పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) పెంచుకొన్న బిడ్డయే, గోదాదేవి. ఆమె పేరే ఆండాలు ఆమె రచించిన ప్రబంధమే 'తిరుప్పావై'. తిరుప్పావై అనగా మంచినోము అని అర్థము. గోద (జీవాత్మ) శ్రీరంగని ప్రేమించినది. (శ్రీరంగనాథుడు – పరమాత్మ). ఆమె తాను కట్టిన తులసిమాలను తొల్త, తానే ధరించి, తర్వాత దానిని భగవానునకు అర్పించెడిది. ఆ దేవునికి ఆ మాలయే ప్రియమైనది. కనుక ఆమెకు "అముక్తమాల్యద" "సూ(శూ)డికొడుత్తనాచ్చియార్" అనెడి పేర్లు కలిగినవి తమిళమున "కోదై" అనగా మాల. చిత్రముగా ఆమెకు "గోద" అన్న పేరు ప్రసిద్ధమైనది. "కోదై" అనే తమిళపదం, తెలుగులో "గోదా" అయినది.

**"ఆండాళ్"** ధనుర్మాస వ్రతమును ఆచరించెను. ఆ వ్రతాచారమందు దిన మొక్క పాశురమును నిబంధించెను. మొత్తము ముప్పది పాశరములకు శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు మృదుమధుర రమ్య పదజాలముతో, బృహద్ వ్యాఖ్యను, పటిష్ఠముగా రచించి తాము ధన్యులై, జన సామాన్యమును తరింపజేసినారు. శ్రీమాన్ అప్పలాచార్యులవారు, తాము పంద్రెండేళ్లు కాకినాడలో ఇచ్చిన ఉపన్యాసములు గ్రంధరూపమున ఆవిర్భవించుటకు కాకినాడ భక్తమండలియే మూల కారణము. ఆ మండలి ప్రత్యేక ప్రశంసలకు అర్హమైయున్నది. శ్రీమాన్ ఆచార్యులవారి గ్రంధ మాధారముగా ఈ రచన కావింపబడినది.

## *1. వ్రత ప్రశంస :*

"ఓ గొల్లపల్లె పడుచులార! మార్గశిరమాసమిది. పూర్ణచంద్రుడు ప్రకాశించెడి పౌర్ణమి. వేకువ సమయము యశోదానందగోపాలసుతుడు, సుందరాకారుడు, సూర్యచంద్రులవలె ఆహ్లాదమిచ్చెడి మోమువాడు, శ్రీమన్నారాయణుడు ఒక్కడే మంగళమును 'పఱ' అనెడి వాద్యమును ప్రసాదించెడివాడు. అతని భజనకై మనము ఇప్పుడు, స్నానమాడ పోవుదమా! ఓ కన్నెలార రండు. హలా! ఎల్ల కాలము చేసెడి మన నోము ఇది కదా!" ఇట్లు గోదాదేవి చెలికత్తెలు పల్కిరి.

## 2. వ్రతవిధి నిషేధములు :

"భాగ్యవతులార! మన వ్రతవిధానము వినరో! పాలకడలి యందు పవళించియున్న పద్మనాభుని పాదాలకు మంగళము పాడెదము. వేకువనే నీరాడి, చేయరాని పనులను వీడి, ములుకు పలుకులను నెట్టి, బీదలకు బిచ్చము, దాసులకు దానము ఇచ్చి, జన్మ తరింప జేసి కొందము. మనము కావించు వ్రతచర్యలను సంతోషముతో వినరో!

హలా! ఎల్లకాలము చేసేడి మన నోము ఇది కదా!

## 3. వ్రత ఫలము :

విశ్వమును కొలిచిన ఉత్తముని నామమును గానము చేయుచు మనము నోముచేయగా, మన కష్టములు తొలగును. వానలు కురియును. వరిపైర్లు పెరుగును. పంట చేలలో చేపలు ఎదుగును. విరిసిన కలువలలో తుమ్మెదలు త్రుళ్లుచుండును. అందమైన పొదుగుల నుండి పిండిన పాడిఆవుల పాలు కడవలలో నిండును. సర్వసంపదలు మెండగును.

## 4. వర్షదేవ ప్రార్థనము :

ఓ వానదేవుడా! దయతో సముద్ర జలమును త్రాగి శ్యామవర్ణుడవై, (తప్తకాంచన వర్ణము) పద్మనాభుని సుదర్శన చక్రమువలె మెఱుపులతో పాంచజన్య శంఖమువలె ఉఱుము లతో, శార్‌ఙ్గ ధనువు నుండి వెల్వడు బాణముల వలె జడివానలను జగత్తంతయు సంతసింపగా ఓ దానశీలా! క్రుమ్మరింపుమా!

## 5. నారాయణ నామోచ్చారణ ఫలము :

మాయల మగడై, మధురలో మెలగి, యమునా నదీ తీరవనాలలో గొల్లలతో నడయాడుచు గొప్ప వంశమును ప్రకాశింపజేసిన వాడును, యశోద కడుపును వికసింప జేసిన వాడును అయిన దామోదరుని గూర్చి, నీరాడి అతనికి పూజలు చేయుచు కమ్మగా గానము చేయగా, మన పూర్వకర్మల పాపములు నిప్పులో దూది వలె కాలిపోవును.

## 6. ఆహ్వానము :

ఓ పిల్లా! పక్షులు కూసెను. వెన్నుని కోవెలలో వెల్ల శంకునాదము వినవా? పూతన విషపు పాలు త్రాగినవాని, మోసపు బందిరూపు రక్కసిని కాలిచే త్రొక్కినవాని, తెల్లని కడలిపై, వేయిపడగల పాము మీద తూగు లోకకారణుని మది తలంచి మునివరులు, యోగులు "హరీ హరీ" అనెడి ధ్వనులు, మన ఎదలను కదల్చుచున్నవి. ఇంక నిదురనుండి లెమ్మా!

## 7. ఆహ్వానము :

ఓ ముగుదా! పక్షులన్నియు కీచు కీచుమని కూయుచున్నవి. గొల్లపిల్లలు సువాసనలు చిమ్మెడి కొప్పులతో, కాసులహారాలతో, కరాల కదలికలతో కావించెడి కవ్వముల సవ్వడి వినబడుట లేదా! ఓ నాయికా! ఆ నారాయణమూర్తి, కేశవుని కీర్తనలను వినియును నీవు నిద్రించుచున్నావా! తేజవతీ! తలుపు తీయవే, తన్వీ!

## 8. ఆహ్వానము :

ఓ పాపా! ఉత్సాహవతీ! తూరుపు తెల్లనయ్యెను. గేదెలు బయలుదేరినవి వానితో పోవుచున్న పిల్లలను పోనియ్యక మాతో కూర్చుకొని, నిన్ను పిలుచుటకు మీ యింట ముంగిటిలో నిలిచియున్నాము. లే! వేగరా! గుఱ్ఱపురూపువాని (కేశి), మల్లురను పరిమార్చిన పరమాత్మను మనము సేవించినచో 'అయ్యో!' అని మన బాధలను తప్పక కృపతో నివారించును.

## 9. ఆహ్వానము :

అత్త కూతుర! మణులమేడల చుట్టు, దీపములు వెలుగుచున్నవి. సువాసనల పొగలు ఘుమఘుమలాడుచున్నవి. తూగు మంచము మీద కదలక కన్నులు మూసికొని యున్నావే! మణివాకిలి తలుపు తీయవే తల్లీ! ఓ అత్తా! నీవైనను లేపవా! ఆమె మూగదా? చెవిటిదా? రోగియా? దాచి కావలి యుంచినారా? మంత్ర ప్రయోగముచే గాఢనిద్రలో ఉన్నదా? "మహా మాయావి! మాధవా! వైకుంఠవాస!" అని కీర్తించుచు, ఆమెను నిద్ర లేపమ్మా.

## 10. ఆహ్వానము :

చిన్న తల్లీ! నోముల సుఖమనుభవించుదానా! తలుపులు తీయకపోయినను. మాటైనా చెప్పవా! పరిమళించు తులసి మాలను ధరించు నారాయణుడు, మనము మంగళము పాడగా, మనకు పరమ పురుషార్థమును (మోక్షమును) ఇచ్చెడి పుణ్యమూర్తి. కుంభకర్ణుడు తన మత్తు నిద్రను నీకిచ్చి తాను మృతి చెందెనా ఏమి? మైమఱచి నిద్రపోవు వన్నెలాడి! మేలుకొని తలుపు తీయవే!

## 11. ఆహ్వానము :

కడవల కొలది పాలను పిండగలవారును, పగతురనెల్ల మట్టు పెట్టువారయిన, శుద్ధ వంశమందు ప్రభవించిన బంగారుతీగా! పాము పడగల వంటి మలుపులు కలదానా! అడవి

నెమలి వంటి వన్నెల చెలీ! లేచిరా! చుట్టాలము మేము నీ యింటికడ నిలిచియున్నాము. మెయిలువన్నెకాని పొగడగా, నీవు ఉలుకవు పలుకవు. అంత మొద్దు నిద్ర ఎందుకమ్మా!

## *12. ఆహ్వానము :*

లేత దూడలను తలచిన ఎనుముల పొదుగుల నుండి పాలుజారి నీ యింటి ముంగిలి తడిసియున్న సంపత్తి గలదానా! చెల్లెమ్మా! పొగమంచు తలలపై కురియుచున్నను మా వాకిలి ముందే గడపను పట్టుకొని నిలిచియున్నాము. ఆ రావణుని వధించిన వీరుడు శ్రీరాముని ఇంపార పాడినను, మాట్లాడవే! ఈ పోతు నిద్ర యేమి? మా రాకను అందరును తెలిసికొన్నారు. ఇంక నిద్ర చాలింపుమా?

## *13. మేలుకొలుపు :*

వికసించిన తామర పూల కనులదానా? పాపా! కొంగరూపు రక్కసుని చంపిన కన్నయ్యను, మాయావి రావణుని వధించిన శ్రీరాముని స్తుతించుచు, బాలలందరు నోము చేయు చోటికి చేరియున్నారు దేవగురుడు అస్తమించినాడు. శుక్రుడు కన్నులకు కన్పట్టు చున్నాడు పురుగుల రొద అధికమైనది. తెల్లవారినది. నిద్ర నటింపవద్దు పడకను వదలి వెంటనే నీరాడ మా వెంటరా!

## *14. మేలుకొలుపు :*

ఓ ఉవిదా! మీ యింటి తోట యందు నూతిలో ఎఱ్ఱ తామరలు పూచినవి. నల్ల కలువలు ముదుచుకొన్నవి అటు చూడు! జీయర్లు, తాళపు చెవులతో కోవెల తలుపులు తెఱచుటకు తరలుచున్నారు. నీవే మమ్ములను నిద్ర లేపెదనని మాటయిచ్చి తప్పినావు లజ్జ లేని దానా! మాటకారి! శంఖచక్రధారిని, ఆజానుబాహుని, పంకజనేత్రుని గానము చేయుటకు రమ్ము. లేచిరా!

## *15. గోపికల సంవాదము :*

గోపికలు : లేతచిలుకా! నిద్రించుచున్నావా?

లోపలి గోపిక : మీరు మంచివారు. గట్టిగా మాట్లాడకండి! నేనిదిగో వచ్చుచున్నాను.

గోపికలు : ఎంతో నేర్పరివే! నీ వాక్కును మేము ఎఱుగమా?

లోపలి గోపిక : మీరే మేటి మగువలు! నేనూ అంతే! దానికేమి?

గోపికలు · వెలుపలికి రా! ఒంటరిగా నుందువేల?

లోపలి గోపిక : అందరు వచ్చినారా?

గోపికలు · వచ్చినారు, వదరుబోతా! లేచి లెక్కపెట్టుకో!

ఆలసింపక మత్తగజమును మర్దించిన వాడు, మార్తురైన మల్లుర మదమణచినవాడు, మనసు దోచిన మాయావి కన్నయ్యను పాడగరావే, కొమ్మా!

## *16. ద్వారపాలకునికి విన్నపము :*

నందుని భవనకాపరీ! ధ్వజతోరణములతో ప్రకాశించు ద్వారరక్షకా! మణులతో మెఱయు తలుపుల గదియల తెఱవవయ్యా! నిన్ననే మాకు, మాయలాడు, మణివర్ణుడు, పాడుటకై వాద్యము ఇచ్చెదనని మాట ఇచ్చినాడు స్నానమాడి నిర్మల మనస్సులతో వచ్చినాము. అయ్యా! మా నెయ్యుని నెలవు తలుపు తీయుమా! కాదనకయ్యా! మేము ప్రాతఃస్తవము కావింపవలెను.

## *17. నందాదుల మేలుకొలుపు :*

ఓ నందుడా! ఆశ్రితులకు, కట్టుగుడ్డ, త్రాగునీరు, తిను తిండి ఇచ్చు దాతా! నిదురలెమ్ము.

అందగత్తెలలో చిగురుబోడి! కులానికి మంగళదీపమా! మా స్వామినీ! యశోదాదేవీ! మేలుకో! మూడులోకాలు ఆక్రమించిన దేవవిభూ! నిద్రింపవద్దు! లే, ఎఱ్ఱని కడియాల బలదేవా! నీవును నీ తమ్ముడును నిద్దుర నుండి లెండు.

## *18. నీలాదేవికి మేలుకొలుపు :*

పరిళమించు కురులదానా! మదగజముల మదమడంచిన నందగోపుని మేనకోడలా! నీలాదేవీ! తలుపు తీయుమా! కోళ్లు కూయుచున్నవి. గురివింద పందిళ్లలో కోయిలలు కుహూ కుహూ అని నాదము చేయుచున్నవి. బంతిని పట్టుకొనెడి చక్కని వ్రేళ్లు కలదానా! నీ ప్రియుడైన, మీ బావను కీర్తింపవచ్చితిమి. ఎఱ్ఱదామర వంటి అందాల చేతులలో కడియాలు ఘల్లుఘల్లు మనగా. తలుపు తీయవే భామా! దీపస్తంభములు కాంతులను చిమ్ముచున్నవి. ఏనుగుదంతపు కోళ్లు గల ఐదు గుణాల మంచము మీద కురుల వాసనలు ఇంపుగా నిండగా, నీలాదేవి శరీరముపై వాలియున్న నిడుద ఱొమ్మువాడా! శ్రీ కృష్ణా! నీవైనను, మాట్లాడవా? కాటుక కళ్ల చెలువా! ఎంతో ప్రొద్దెక్కినది. లేచుటకు పూనవా! కొంత కాలమైనను కాంతుని విడిచి యుండలేవా! ఆహా! ఇది నీ స్వభావము కాదే! ఇది నీకు తగిన పనియా?!

## *20. మేలుకొలుపు :*

ముప్పదిమూడుకోట్ల దేవతల ఆపదలను, ఆర్తిని హరించు బలీయుడా! ఋజువర్తనుడా! పరాక్రమశాలీ! శత్రువులకు భయము కల్గించు తేజస్వీ! మేలుకోవయ్యా! అందమైన మృదువైన స్తనములు కలదానా! ఎఱ్ఱని పెదవియు, సన్నని నడుము కలదానా! పరిపూర్ణురాలా! లక్ష్మీసమానురాలా! నిదురలేవమ్మా. వీచుటకు ఆలవట్టము (విసనకఱ్ఱ), కంచుటద్దము మాకిచ్చి శ్రీకృష్ణునితో మమ్ము నీరాడ జేయవమ్మా! అంగనామణీ!

## *21. శ్రీ కృష్ణ స్వామికి మేలుకొలుపు :*

పెక్కు కడవలు నిండుగా పాలనిచ్చు పాడియావులు గల నందగోపుని కుమారుడా! మేల్కొనవయ్యా రక్షకుడా! మహాత్మా! లోకమందు అవతరించిన తేజఃస్వరూపా! నిద్ర నుండి లెమ్ము. శత్రువులు, నీకు వశమై నీ పాదములు ఆశ్రయించినట్లు మిత్రులమైన మేము, నీ గుణములను మెచ్చి, నీ సేవకురాండ్రమై, నీకు మంగళములు పాడుటకు వచ్చియున్నాము. నీ నిద్రను చాలించి దయజూపుమా!

## *22. శ్రీకృష్ణ కటాక్ష ప్రభావము :*

ఓడిన రాజులు, గర్వము వీడి, తమ్ము జయించిన రారాజును చేరిన విధమున మేము అభిమానమును వదలి, గుమిగూడి నీ సింహాసనమును సమీపించియున్నాము. చిఱు గంటల ముఖమువలె, అరవింద దళములపోలు, ఎఱ్ఱని నీ కంటిఱెప్పల వెలుగులను మాపై ప్రసరింపజేయుమా!

సూర్యచంద్రుల కాంతులను ఒకేసారి, నీ కన్నులతో మాపై కురియుము. మా కర్మ ఫలములైన పాపములన్నియు పటాపంచలగును.

## *23. గోపికల ప్రార్థనము :*

వర్షాకాలమందు, పర్వతగుహలో గాఢనిద్ర చెంది మేల్కొని జూలు విదిలించుకొని, కంటి కాంతులను మెఱయజేయుచు, గర్జనలతో వెల్వడు మృగరాజు విధమున, అవిసెపూవు వంటి అందమైన అంగములు కలవాడా! నీవు, నీ భవనమునుండి వెలుపలికి వచ్చి, నీ సింగపుగద్దియను అధిష్ఠించి, మా రాకకు కారణమును తెలిసికొనుమా!

## *24. మంగళాశాసనము :*

జగమును కొలిచిన నీ పాదాలకు మంగళము. లంకా నాశకుండవైన నీ భుజ బలము నకు మంగళము. శకటాసురుని తన్ని కూల్చిన నీ శక్తికి మంగళము. ధేనుకాసురుని విసిరివేసిన

నీ దివ్య పాదాలకు మంగళము. గోవర్ధన పర్వతము నెత్తి గోపాలురను రక్షించిన నీ కృపా దృష్టికి మంగళము. రాక్షసులనుకూల్చిన నీ బల్లెమునకు మంగళము. నిన్ను స్తుతించి మేము ఇప్పుడు నీ వాద్యమును కొని మా కోరికలను తీర్చుకొనుటకు వచ్చినాము కరుణింపుమా!

## 25. గోపికల శ్రీకృష్ణ స్తుతి

దేవకి బిడ్డవై, యశోద కొడుకై, వ్రేపల్లెలో పెరిగి మామ కంసుని కుట్రలన్నియు వమ్ము చేసి, అతని ఎదలో నిప్పుగా నిలిచిన, ఓ వరదా! నీ వాద్యము నిచ్చి, మా కోరికలను తీర్చెదవని, వచ్చినాము నీ ఐశ్వర్యమును, శౌర్యమును కీర్తించి మా సంతాపమును వీడి సంతసించుచున్నాము.

## 26. వ్రతసాధనములకై విన్నపము :

ఆశ్రితవత్సలా! నీలశరీర! వటపత్రశాయీ! మార్గశిర మాస పవిత్ర స్నానమునకై వచ్చినాము. మా వ్రతమునకు కావలసిన పరికరములను కోరెదము. పాంచజన్యమును అతిశయించు శంఖములను ఘనఘోషలు గల వాద్యములను, గాయకులను పల్లాండు పాడువారిని, ద్వీపములు ధ్వజములు, మేలివితానములు మాకు ఇమ్ము.

## 27. వ్రతాచరణ సమ్మానములు :

శత్రుంజయా! గోవిందా! నిన్ను కీర్తించి నీవిచ్చెడి వాద్యమును స్వీకరించి మేము కొన్ని బహుమానములను నీ దయతో లోకంబు ప్రశంసించునట్లు పొందవలెను. కనుక మాకు గాజులు, సరములు (దండలు), కడియాలు, చెవికమ్మలు, లోలకులు, మొదలగు వానిని మేము ధరింపవలెను. స్నానమాడి, కొత్తబట్టలు కట్టుకొని, తర్వాత పాలన్నమందు నేయి పోసుకొని, ఆ నేయి మోచేతి నుండి జారుచుండగా ఆ తియ్యని సాపాడు నీతో కలిసి ఆరగించవలెను. మా వ్రత సమ్మానములు ఇవియే.

## 28. అభీష్టముల నిమ్మని గోపికల అభ్యర్థనము :

గోవిందా! గోవులను అడవులలో మేపుకొనుచు జీవించెడి తెలివిలేని గొల్లలము. మాతో నీవు జన్మించుట మా భాగ్యము. లోపములేని స్వామీ! నీతో తిరిగి ప్రేమను పెంచు కొన్నాము. ఆ బంధమును త్రెంచుకొనుట మాకు సాధ్యము కాదు. చనువుతో నిన్ను "గోపయ్యా! కన్నయ్యా!" మొదలైన ముద్దుపేర్లతో పిలిచినాము. కోపము చెందక మమ్ము మన్నించి, వాద్యమును ఇచ్చి మా కోరికలను తీర్పుము.

## 29. గోపికలు సాహచర్యసౌభాగ్యమును అర్థించుచున్నారు :

వేకువయందే నెచ్చెలురతో వచ్చి నీ సుందర పదకమలములను సేవించుటకై వచ్చినారము. మా మంగళ గానముల ప్రయోజనములను వినుమా! గోకుల మందు పుట్టిన నీవు మా మానసిక అర్పణలను అంగీకరింపవలెను. మేము ఇహలోక వస్తువులకై నీ కడకు వచ్చితి మనుట వాస్తవము కాదు. ఏడేడు జన్మలమందును ఏనాటికిని, నీకు దాస్యము చేయుటకు అనుగ్రహింపుము. ఇతర వాంఛలను మాలో త్రుంచివేయుము సదా నీ సాహచర్య సేవయే మా జీవిత పరమార్ధము.

## 30. ఫలశ్రుతి :

పాలకడలిని త్రచ్చిన లక్ష్మీపతి, కేశవుని, పున్నమినాటి చంద్రుని పోలు రమణీయ ముఖులు వ్రేపల్లె గోప కన్యలు వినుతించి ధక్కిని కోర్కెలు తీర్చుకొన్న వార్తలను శ్రీ విల్లి పుత్తూరు నివాసి పెరియాళ్వారు సుపుత్రి గోదాదేవి, తమిళవాడుక భాషలో ముప్పది పాశురముల (క్రీర్తనమాలను)ను సృజించినది వీనిని చదివెడివారు దీర్ఘచఃతుర్భుజుడు, అరవిందారుణ నేత్రుడు శ్రీమన్నారాయణుని కరుణచే నిత్యానందమును అనుభవింతురు.

### తిరుముక్కుళమ్ తీర్థమ్ :

శ్రీ విల్లిపుత్తూరులో, ఆలయ సమీపమందు పెద్దకోనేరు ఉన్నది దీనికొక ఇతిహాస మున్నది శ్రీమన్నారాయణుడు కాలనేమి అనే రాక్షసుని తన సుదర్శన చక్రముతో వధించెను. రక్తసిక్తమైన ఆచక్రమును గంగా, యమునా, సరస్వతీ అనెడి నదీదేవతలచే పరిశుద్ధము చేయిం చెను అప్పుడు ఏర్పడిన జలసమూహమే, **"తిరుముక్కుళమ్"** అనెడి పేరుతో ప్రసిద్ధమై ఉన్నది.

### ప్రముఖ గోపురముల ఎత్తు (అడుగులలో)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీరంగము | - | శ్రీరంగనాథస్వామి | 250 అడుగులు |
| 2 | తిరువణ్ణామలై | - | శ్రీఅరుణాచలేశ్వరస్వామి | 217 " |
| 3. | తంజావూరు | - | శ్రీబృహదీశ్వరస్వామి | 216 " |
| 4. | మధుర | - | శ్రీసోమసుందరేశ్వరస్వామి | 200 " |
| 5 | శ్రీవిల్లిపుత్తూరు | - | శ్రీరంగమన్నారుస్వామి | 196 " |
| 6 | కాంచీపురము | - | శ్రీఏకామ్రేశ్వరస్వామి | 188 " |
| 7. | చిదంబరము | - | శ్రీనటరాజస్వామి | 160 " |
| 8. | రామేశ్వరము | - | శ్రీరామలింగేశ్వరస్వామి | 126 " |

# ఏడుకొండలు - ఏడు కాండములు

## (సంక్షిప్త కృతి)

శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారి కులదైవము శ్రీనివాసుడు. శ్రీనివాసుని నిలయము తిరుమల. ఆ స్వామిని దర్శించుటకు ఏడుకొండలను ఆరోహించి పోవలెను. వానికి వేర్వేరు పేర్లు ప్రసిద్ధములై యున్నవి.

శ్రీమద్రామాయణము, ఏడుకాండముల మహాకావ్యము. శ్రీరాముని చరిత్రము, అందులో నున్నది. ఏడుకొండలందు, ఏడుకాండలందు కల సమభావ సంబంధమును శ్రీమాన్ ఆచార్యులవారు, తమ గ్రంథములో స్పష్టముగా తేల్చి చదువరులకు నివేదించినారు రెంటిలోను ఉపనిషత్ రహస్యము ప్రతిపాదింపబడినది. ఆ ఉపాయనసారమిచట సంక్షిప్తముగా ప్రవచింపబడినది.

వేదమే రామాయణముగా అవతరించినది. అందుగల పరబ్రహ్మతత్త్వమే రామాయణ మందు ప్రబోధింపబడినది. శ్రీతత్త్వము, భగవత్ తత్త్వము, రెండును పరబ్రహ్మతత్త్వ భావనలో ఒక్కటిగా ఇమిడియున్నవి. వానిని వేఱుగా భావింపరాదు. "రామ" పదమందు, "రమ" (సీత) ఐక్యమై యున్నది. "శ్రీనివాస" పదమందు "శ్రీ" (లక్ష్మి) అట్లే కలిసియున్నది. శ్రీరాముడు సీతాపతి అనగా మహాలక్ష్మి వల్లభుడే! సర్వజగత్తునకు కారణమైన శక్తి "శ్రీ". ఆమె సర్వేశ్వరునిలో నున్నది.

### *శ్రీ శబ్ద వివరణము :*

"శ్రీ" అనగా ఆశ్రయించుట అని అర్థము. ఆమె నిత్యము, సర్వేశ్వరుని ఆశ్రయించి యున్నది. సర్వేశ్వరుడు ప్రథముడు. ఆమె ద్వితీయ. ఇరువురును ఒక్కరే. అదియే వారి సంబంధము. మనము ఆమెను ఆశ్రయింతుము. ఆమె ద్వారానే మనకు సర్వేశ్వరునితో అనుబంధము.

### *ప్రణవ మహిమ :*

ప్రణవమనగా "ఓంకారము". **"ఓమ్"** అనెడి అక్షరమందు విశ్వమంతయు ఉన్నది. ఆ యొక అక్షరమునే ఉపాసించి, పరమార్థమును సాధింపగలము. శ్రేయోదాయకమైన మంత్ర రాజము "ఓంకారము".

**శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ॥**
**యః ప్రయాతి త్యజద్దేహం స యాతి పరమాం పదమ్ ॥**

**భావము :** ఓమ్ పరబ్రహ్మవాచకము. దానిని ఉచ్చరించుచు, నన్ను ధ్యానించుచు శరీరమును త్యజించు జీవుడు పరమపదమును పొందును.

*భగవద్గీత, 8 అధ్యా 13వ శ్లోకం*

## ఏడుకొండలు :

తిరుమలేశుడు ఏడుకొండలవాడు. వేదమనగా పర్వతము కొండలలో వేదతత్త్వము నిక్షిప్తమైయున్నది. ఆ కొండల పేర్లను, వాని అర్థమును తెలిసికొన్న యెడల, అందుగల విశేషము బోధపడును. "ఏడు" అనెడి సంఖ్య మిక్కిలి గొప్పది. సప్తలోకములు, సప్తఋషులు సప్తచక్రములు, సప్తవ్యాహృతులు (ప్రాణాయామము), ఇట్లు "సప్త" సంఖ్య ప్రాధాన్యము సంతరించుకొని యున్నది. అట్లే ఏడుకొండలు, వేదార్థమును చక్కగా చిక్కగా ప్రతిపాదించుచున్నవి.

## 1. వృషభాద్రి

ఇది మొదటి కొండ. వృషభము అనగా ఎద్దు శబ్దము, అనియు అర్థము శబ్దము ధ్వనిరూపమైన బ్రహ్మము. దానికి నాలుగు కొమ్ములు, మూడు పాదాలు, రెండు తలలు, ఏడు చేతులు. అది మూడు చోట్ల కట్టబడి యుండును ఇది విచిత్రమైన ఎద్దు మనము మాట్లాడెది "మాట" శబ్దము, మూడు చోట్ల నుండి వెల్వడును. ఆ స్థానములు 1. ఉరము (రొమ్ము), 2. కంఠము (గొంతు), 3. శిరము (తల).

**నాలుగు కొమ్ములు :** శబ్దము, వాగ్రూపము. వాయు సంచలనముచే, కలుగుచున్నది. మూలాధార చక్రమందుండి అగోచరమైన, "పరా" అనడి వాక్కు జ్ఞాన, ఇచ్ఛా క్రియా శక్తులచే, జనించును. 'పరా' మొదటి కొమ్ము. అదియే "పశ్యంతీ", "మధ్యమా", "వైఖరీ" అనెడి మఱి మూడు కొమ్ములను కలిగియున్నది. శబ్దపరిణామ దశలివి. మనము వినెడి వాక్కు "వైఖరీ".

**మూడు పాదాలు :** శబ్దానికి చెందిన వర్తమాన, భూత, భవిష్యత్కాలాలు, మూడు పాదాలు.

**రెండు తలలు :** శబ్దానికి కారణరూపమైన మొదటిది తల, కార్యరూపమైనది రెండవది. కారణరూపములో శబ్దము అఖండము. కార్యరూపములో ఖండము (వెలుపలికి వచ్చినప్పుడు).

**ఏడు చేతులు :** శబ్దానికి వర్తించు ఏడు విభక్తులు, ఏడు చేతులు.

**రోరవీతి :** ఆ ఎద్దు అంకె వేయుచున్నది. అనగా, వృషభాద్రి వేదప్రమాణమును ఘోషించుచున్నది. వేదమును అంగీకరించుటయే, వృషభాద్రి యొక్క ఆరోహణము.

## 2. వృషాద్రి

ఇది రెండవ కొండ. వృషమనగా ధర్మము. వేదమును సమ్మతించి ధర్మాచరణకు ప్రయత్నించి ఆ కొండను ఎక్కుట పరోపాసన. దీనికి చిత్తశుద్ధి అవసరము. ధర్మపరమైన చిత్తముచే అది సాధ్యము. కనుక ధర్మబద్ధమైన గమనమది. ఇది' కర్మకాండము పరోపాసనకు తొలిమెట్టు

***3. గరుడాద్రి :*** ఇది మూడవ కొండ "గరుడుడు" అనగా వేదము. అది ఛందోరూపము. వేదార్థములను ఎఱుగుటచే, భగవత్ స్వరూపము తెలియును గరుడాద్రి ఆరోహణమనగా, భగవంతుని ఎఱుగుట. ఇది జ్ఞాన కాండము.

***4. అంజనాద్రి :*** ఇది నాల్గవది. అంజనమనగా, కనబడని దానిని కనుగొనెడి మంత్రతంత్రము. ఇచ్చట అంజనమనగా, కనబడని "ఆత్మను", మనస్సును వశము చేసికొని, దాని పోకడలను అణచివేసి, గుర్తించి దాని చైతన్యమును అనుభూతికి తెచ్చుకొనుట. మంత్రోపాసనచే ఆత్మను అభివ్యక్తమగునట్లు కావించుకొనుట. కనుక అంజనాద్రిని ఎక్కుట అనగా పరమాత్మ చైతన్యమునకు వశమగుట అని వ్యంగ్యార్థము.

***5. శేషాద్రి :*** ఇది ఐదవ కొండ. "శేషి" అనగా శేషము కలవాడు. జీవులు శేషములు. పరతంత్రులు. శేషి స్వతంత్రుడు. సర్వ నియామకుడు. జీవుడు తన ఉనికికి, మనికికి సర్వకారణ భూతుడను జ్ఞానముచే – భక్తితో భాగవతుల సేవకు ఉపక్రమించవలెను. అదియే శేషాద్రి ఆరోహణము.

***6. వేంకటాద్రి :*** ఆఱవ కొండను ఎక్కుటచే, పూర్వసంచిత పాపములు తొలగును. "వేం" అనగా పాపములు "కట" అనగా తొలగునని భావము. భక్తిచే జీవుడు, పాపముల నుండి విడుదలను పొంది (స్వామి కృపచే) నిర్మల పవిత్ర భావముచే భగవత్ దర్శనమునకు అర్హతను పొందును.

***7. నారాయణాద్రి :*** ఇది ఏడవది. శ్రీమన్నారాయణ ప్రాప్తి, జీవికి పరమార్థము. బ్రహ్మజ్ఞాన పూర్ణసంసిద్ధితో, పరబ్రహ్మమందు ఐక్యమగుటయే, నారాయణాద్రి సమారోహణము జీవి ఆ కొండను ఎక్కి జీవితమును సఫలము చేసికొని పరమానందానుభూతిని పొందును.

ఈ విధముగా ఏడుకొండలందు, పరమార్థము ప్రతిపాదింపబడినది.

## శ్రీమద్రామాయణము! ఆది శ్లోకము! మంగళవాక్యము

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠా త్వమగమః శాశ్వతీ సమాః
యత్ క్రౌంచమిధునాదేకమ్ అవధీః కామ మోహితమ్ ॥
క్రౌంచ పక్షులలో మగదానిని, బోయ కూల్చెను. అపుడు
వాల్మీకి శోకము ఇట్లు అతని నోటినుండి వెల్వడినది.

**బాహ్యార్థము :** "ఓ బోయవాడా! కామముతోనున్న పక్షులలో ఒక్కదానిని చంపినావు! నీవు పెక్కేళ్లు బ్రతుక జాలవు"

**అంతరార్థము :** "ఓ లక్ష్మీ నివాస! నీవు శాశ్వతముగా వర్ధిల్లుము. కామముతో ప్రవర్తించిన పక్షిని (రావణుని) చంపినావు" ఇది ప్రశంస అపకారము చేసిన వానిని అణచినావు. శుభ ప్రదము. నీ చర్య మంగళకరము. "నీవు పదిలముగా సుఖముగా ఉందువు" అని వాల్మీకి ఆదేశము. బోయని తిట్టు, రామునకు బొట్టు (తిలకము) – ఇది లోపలి మంగళాశాసనము.

**విశేషార్థము :** (వేదాంతపరమైనది) ఆత్మ మనఃప్రభావమునకు వశమైయుండును. అహంకార మమకారములకు, మనస్సు నిలయము. ఇవి రెండును దూరమైనప్పుడే, జీవాత్మ పరమాత్మ సన్నిధి చేరును సీత–జీవాత్మ. రావణుడు మనస్సు. సీతను బంధించినాడు. అతడు హతుడైనాడు. సీత శుద్ధిని పొందినది. ఆమె పవిత్రురాలై పరమాత్మలో ఐక్యమైనది. ఈ విధముగా జీవాత్మ పరమాత్మానుసంధానము జరిగినది.

## శ్రీరాముడు రూపము ధరించిన ధర్మము :

వేదములు చెప్పిన ధర్మస్వరూపము శ్రీరాముడు అతడు పరబ్రహ్మము. ఇది ఉపనిషత్ రహస్యము. అది శ్రీరామాయణ మందు నిబంధింపబడియున్నది. పరిశీలింతము.

**1 బాలకాండము :** మొదటి కొండపేరు, వృషభాద్రి. వృషభమనగా ఎద్దు, శబ్దము, అగ్ని అనెడి అర్థములు కలవు. అగ్ని హుతమును దేవతలకిచ్చును. మంత్రములచే అగ్ని తన కార్యమును నిర్వహించును. యజ్ఞము అగ్నికార్యము. యజ్ఞ భూమి నుండి సీతామాత జనకునికి లభించినది. దశరథుడు పుత్ర కామేష్టిచే నల్వురు పుత్రులను పొందినాడు. యజ్ఞముచే, అగ్ని మంత్ర వైభవములు ప్రకాశించినవి. ఇట్లు వేదశబ్దప్రమాణములు అంగీకరింపబడినవి.

**అహల్యకథ :** మనస్సు కామము చేత నిండినప్పుడు "ఆత్మ" శబ్దప్రమాణమునకు అనగా వేదమునకు దూరమై జడపదార్థ మగును. అది, శబ్దరూపమైన మంత్రముచే, యధార్థ స్థితిని

పొందును. ఈ వేదపరమైన భావము అహల్యా గౌతముల కథలో నున్నది. అహల్య-జీవాత్మ. ఇంద్రుడు-మనస్సు. ఇంద్రునకు వశమైనది అహల్య. అజ్ఞానముచే అట్లు జరిగినది. దాని ఫలము. ఊరూపు పొందినది అచేతనమైనది. వృషభము-గోశబ్ద పర్యాయపదము. దానికి సంబంధించినది గౌతమ "శబ్దము". అహల్య శబ్ద ప్రమాణమునకు దూరమైనది అనగా గౌతముడు, ఆమెను విసర్జించెనని అర్థము కనుక ఆమె జడమైనది పరమాత్మమైన శ్రీరాముని పాదధూళిచే ఆమె స్వరూపమును పొందినది. పద (శబ్ద) సంబంధమైన ప్రభావముచే అహల్య పవిత్రురాలై పరమాత్మలో చేరిపోయినది

***సీతాకళ్యాణము :*** ధనువును విఱిచి, శ్రీరాముడు సీతను పరిణయమాడెను. ధనుస్సు - ఓంకార రూపము. మూడు ముక్కలు అయినది అనగా, మూడు వర్ణముల సమాహారమే. ప్రణవము. ప్రణవము సాధనముగా (ధనువు కారణమగా) సీత (జీవాత్మ) శ్రీరాముని (పరమాత్మ) చేరినది.

***2 అయోధ్యాకాండము :*** రెండవ కొండ వృషాద్రి. వృషమనగా ధర్మము అయోధ్యాకాండ మందు మానవధర్మాలు మానవతకు అవసరమైన ధర్మాచరణము ప్రాధాన్యము వహించినవి.

***3 అరణ్యకాండము :*** మూడవ కొండ గరుడాద్రి. అరణ్యవాసులు నిస్సంగులు. మునివృత్తి నవలంబించినవారు. జ్ఞానులు పరమాత్మను తెలిసికొనువారు. ఇది జ్ఞాన కాండము. ఉపనిషత్తులకు ఆరణ్యకములనియు పేరు ఇది సార్థకము.

***4 కిష్కింధాకాండము :*** నాల్గవ కొండ అంజనాద్రి. ఆంజనేయుడనగా మంత్రము. మంత్రముచే భగవత్ చైతన్యము బోధపడును శబ్దరూపమైన మంత్రములచే ఐహిక ఆముష్మిక సుఖములు లభించుచున్నవి.

***5 సుందరకాండము :*** అయిదవ కొండ శేషాద్రి శ్రీరాముడు సుందరుడు. సీతాదేవి సుందరి. ఆంజనేయుడు సౌందర్యోపాసకుడు పరతంత్రులు సీత, హనుమ వారి పరాధీనతయే శేషత్వము. వారు పరమాత్మ సర్వస్వతంత్రతను విశ్వసించి ధ్యానించి తన జీవితమును ధన్యము చేసికొనిరి.

***6 యుద్ధకాండము :*** ఆఱవ కొండ వేంకటాద్రి. తామస ప్రవృత్తిగల రావణ కుంభకర్ణాదులు నశించిరి సాత్త్విక ప్రవృత్తిగల విభీషణాదులు సద్గతిని పొందిరి. ధర్మమే జయించినది. సీతాదేవికి శ్రీరామదర్శనము లభించినది. పరిశుద్ధ సత్త్వముచే పరమాత్మ దర్శనము సులభ సాధ్యము.

**ఉత్తరకాండము :** ఏడవ కొండ నారాయణాద్రి. జీవి, శ్రీమన్నారాయణునిలో ఐక్యమగుటకు దాసుడయి భాగవత సేవలో తరించును శ్రీరాముడు తాను మానవుడుగనే ప్రవర్తించెను. తన చర్యలచే భగవత్ తత్త్వమును శ్రీరాముడు ప్రకాశితము చేసెను. చిట్టచివర ధర్మస్వరూపుడు శ్రీరామచంద్రుడు సముద్రమును ప్రవేశించెను. అదియే మహా ప్రస్థానము. నారాయణ స్థానము సముద్రము కదా!

విచిత్రముగా ఏడుకొండలు, ఏడు కాండములు ఉపనిషదర్థములను సమతుల్యముగా పటిష్ఠముగా ప్రతిపాదించుచున్నవి

# నాచ్చియార్ తిరుమొళి (ఝి)

ప్రస్తావన

### తిరుమొళి (సిరిమొర)

ఆండాళ్ (గోదాదేవి) రచనలలో రెండవది తిరుమొళి. ఇది నాళియిర ప్రబంధంలో తమిళభాషలో ఉంది. తిరుప్పావైకి ఉన్నంత బహుళ ప్రచార దీనికి ఏలనో లేకపోవడం వింతగా ఉంది. బహుశా ధనుర్మాస వ్రతపాలనలో తిరుప్పావై అధిక ప్రాధాన్యం వహించడం వల్ల, మధురభక్తిభావ బంధురత వల్ల **తిరుమొళి** భక్తులదృష్టిని అంతగా ఆకర్షించలేదేమో! తిరుమొళిలో పదునాల్గు తరంగాలు (ప్రకరణాలు) ఉన్నవి 11 తరంగాలలో 10 పాశురాలు చొప్పున (11×10=110), 3 తరంగాలలో (4,5,6) 11 పాశురాలు చొప్పున (11×3=33) మొత్తము 143 పాశురాలు ఉన్నవి. 14వ తరంగంలో (తెలుగులో) ఉన్న పాశురం కలుపుకొంటే సంఖ్య 144 అవుతుంది.

### సరస విప్రలంభ శృంగార ప్రబంధం

"నాచ్చియార్ తిరుమొళి" భగద్విరాహార్తిని ప్రకటించే సరసకావ్యం".

గోదాదేవి తన ప్రణయ విచారపరంపరను మధురభక్తితో సింగారంగా, వెల్లడించి శ్రీరంగనాధుని అంతరంగాన్ని రాగరస తరంగితం చేసింది".

**– *శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు***

"నాచ్చియార్ తిరుమొళి" అంటే అమ్మవారి **"శ్రీసూక్తి"** అని అర్థం..... "తాను శ్రీరంగనాధుని చేరువగుటకు అనుభవించిన విరహదశను రమణీయంగా వివరించిన దివ్యప్రబంధము".

**– *శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు***

"తిరుప్పావై వలె ఇది కూడా గోపికల ఆచరణకు అనుకరణ మాత్రమే కాక, స్వానుష్ఠాన రూపమని, తెలియవలయును. ఇట్లు తాను వలచిన ప్రియుని పొందుటకు ప్రియురాలు చూపెడి తహతహ, త్వర ఆర్తి శృంగార విలాస హావభావ భరితమేగాక అత్యుత్తమమైన భక్తిరసానుభవ పరమ రూపము కూడా.

భగవంతుడు జీవులందరికీ పతియే. మనమందరము ఆతని ప్రియురాండ్రము. భగవంతుని పొందుటలో ఆలస్యమును సహింపజాలము. ఆ ఆర్తిని, తపనను జీవులలో నింపుటయే ఈ ప్రబంధమునకు పరమ ప్రయోజనము".

**– శ్రీమాన్ కందాడై రామానుజాచార్యులు**

"గోదాదేవి శ్రీకృష్ణుని మనోనేత్రంతోనే దర్శించింది. అంతేకాదు ప్రణయభక్తితోపాటు కవితాశక్తిని కూడ కల్గిన మహాశక్తి ..

"తపోమార్గంలో, మహాన్వేషితో, స్వీయసౌందర్యంతో కల్యాణకాంక్షతో, కవితా మాధుర్యంతో, వ్రతనియమనిష్ఠలతో మధురభక్తి తత్త్వానికి పుష్టిని తుష్టిని చేకూర్చి, కాంతాభక్తికి జీవం పోసింది".

***– డా॥ కె. విజయ***

శ్రీమాన్ వేదాంతదేశికులు (వేంకటనాధులు) గోదాదేవి మధురభక్తిని (స్త్రీత్వభావనతో) విశిష్టంగా స్తుతించారు. తిరుమొళిలో, కామదేవుని ప్రార్ధనము, గోపికగా తాను భావించుకొని నిర్మించుకొన్న బొమ్మరిళ్లను కూల్పవలదని శ్రీకృష్ణుని అర్థించుటకై కావించిన దీనాలాపము. గోపాలుడు హరించిన వలువలునిమ్మని కోరుట. ఫలచక్రప్రక్రియ, కోకిలల ద్వారా సందేశము, స్వప్నంలో పాణిగ్రహణ మహోత్సవ సందర్శనము. నిరంతరం అధరామృతం ఆస్వాదించే, శంఖము యొక్క భాగ్యప్రశంస, మేఘసందేశము, విరహవేదనను గూర్చి వనాద్రినాథ మయూరాదులతో వినతి, చెలికత్తెలను శ్రీకృష్ణవిహార క్షేత్రాలకు కొనిపొమ్మని అభ్యర్థనము, శ్రీకృష్ణస్వామి ధరించిన వస్త్రతులసీ మాలికలను తెచ్చి యిచ్చి తన్ను రక్షింపుడని ప్రలాపము, మఱియు చెలికత్తెలతో గోద పరస్పర సరససంభాషణము, వారి సమాధానములు మొదలగునవి అత్యంత రమ్యరసభరితములై చదువరులను అలరింపజేయుచున్నవి.

శ్రీమాన్ ఆచ్చి వేణుగోపాలాచార్యవర్యులు రచించిన **"గోదా శ్రీకృష్ణ తృష్ణ"** జీవుల ఆర్తిని అంతం చేసే గేయప్రబంధరూప పరమౌషధము. వారి గేయాన్ని పఠించిన పామరులు సైతము మధురభక్తిభావరసానుభవానికి వశులై పరవశించెదరు.

# శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి భవ్యచరితము





# శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య భవ్యచరితము

*"శ్రీరామ జయమ్"*

## *మైత్రీబంధము : శ్రీకాకుళం*

శ్రీకాకుళంలో, 1951వ సంవత్సరం మద్రాసు ప్రభుత్వం, డిగ్రీ కళాశాలను నెలకొల్పింది. మొదటి ప్రిన్సిపాల్ శ్రీ ఫజులుల్లా (మద్రాసువారు). సంస్కృతానికి శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు. తెలుగు భాషకు శ్రీ అనువూరు నాగభూషణరావు - ఉపన్యాసకులు. తర్వాత 1952వ సంవత్సరారంభంలో అప్పలాచార్యులవారికి మద్రాసు, రాజధాని కళాశాలకు బదిలీ వచ్చింది. వారి స్థానంలో శ్రీవాసా అణ్ణప్పశాస్త్రులు చేరారు. నేను ఆ సంవత్సరమే నవంబరు నెలలో, రాజమహేంద్రవరం నుంచి, శ్రీకాకుళానికి ప్రమోషను మీద అసిస్టెంటు లెక్చరరు (గ్రేడ్ 1) గా చేరాను.

## *మద్రాసు నుండి బదిలీ (1954వ సంవత్సరం)*

శ్రీవాసా అణ్ణప్పశాస్త్రులు, రెండవ గ్రేడు అసిస్టెంటు లెక్చరరు (సంస్కృతం) పదవి నుండి 1954వ సం॥ రిటైరైనారు. ఆ పదవిలో శ్రీ ఆచార్యులవారికి శ్రీకాకుళం కళాశాలలో స్థానం లభించింది. అప్పుడు అయిదుగురు మాత్రమే సంస్కృతం చదివేవారు. వారొక్కక్కరు రూ॥5/- చందా యిచ్చారు. నేను స్వయంగా రూ॥ 25/- ఇచ్చాను. మొత్తం రూ॥50/-లతో శ్రీ శాస్త్రుల వారి విరమణోత్సవం నిర్వహించాము. ఆ నాటి చిత్రకారులు శ్రీ నాగేశ్వరరావు, శ్రీ శాస్త్రుల చిత్రపటాన్ని చక్కగా తయారు చేసి యిచ్చారు.

శ్రీమాన్ ఆచార్యులవారి పునరాగమనం, వారికి సంతోషదాయకం. నాకంటె వారు ఆఱు నెలలు మాత్రమే వయసులో పెద్ద. నాకు అన్నగారయ్యారు. వారిని మొదట చూచినప్పుడు, నాకు తెలియకనే నన్ను వారు ఆకర్షించారు. వారిలో ఉత్సాహం అధికంగా కన్పట్టేది కాదు తర్వాత అర్థమయింది. రెండవ గ్రేడు ఉపన్యాసకుని ప్రారంభ వేతనం రూ॥ 85/- మాత్రమే. అందువల్ల వారి ఆర్థికస్థితి స్తిమితంగా లేదు. బదిలీల వల్ల, కుటుంబభారం వల్ల, మఱి ప్రథమపుత్రిక చిరంజీవి సౌభాగ్యవతి తిరువేంగళమ్మ పెళ్లి వల్ల, ద్వితీయపుత్రిక లక్ష్మి జననం

వల్ల వారు ఆర్థికంగా ఇబ్బందుల్లో పడ్డారు. వారికి సాయం చేయాలనే సంకల్పం నాలో చెలరేగింది. దానికొక ఉపాయం సుగమమయింది.

## ప్రభుత్వ కో-అపరేటివ్ స్టోర్సు

శ్రీ చింతలూరు సుబ్రహ్మణ్యంగారు, ప్రిన్సిపాల్, స్టోర్సు అధ్యక్షులు దానికి కార్యదర్శి నేను. పుస్తకాల అమ్మకం వల్ల లాభాలు బాగా వచ్చేవి ఒక దినం సాయంకాలం ఒంటరిగా వున్నప్పుడు శ్రీ ఆచార్యులతో "ఆచార్యులుగారూ! మీ సాయం కావాలి", అన్నాను

"మీరు కోరితే కాదంటానా?" అన్నారు.

"మూడు నెలలు సాయంకాలం మాత్రం, పుస్తకాలు అమ్మేటప్పుడు ఒక గంట సేపు నాతో ఉండండి. అంతే చాలు" అన్నాను. "సరే! అదేమీ కష్టమైన పని కాదే!" అన్నారు.

మాసాంతంలో రూ॥ 30/- గౌరవభృతి శ్రీ ఆచార్యుల వారికి ఇచ్చాము. ఆ విధంగా వారికి మొత్తం రూ॥ 90/- మూడు నెలలకు లభించింది. ఆ మొత్తం చాల తక్కువ కానీ, ఆనాటి అవసరాలకు అది ఆచార్యుల వారికి ఊఅటనిచ్చింది.

## సార్వత్రిక ఎన్నికలు (1955వ సంవత్సరం)

భారతదేశం, మొట్టమొదట 1955వ సం॥ ఫిబ్రవరి నెలలో, ఎన్నికలను నిర్వ హించుకొన్నది. అప్పటి ఎన్నికలో మా కళాశాల అధ్యాపక బృందం అంతా పాల్గొన్నాము విడిగా, అయిదు తేదీల్లో ఎన్నికలు జరిగినవి ప్రయాణపు ఖర్చులకు గాను నేను స్వయంగా చొరవ తీసికొని శ్రీ ఆచార్యులవారి ట్రావెలింగ్ అలవెన్సు బిల్లులను తయారు చేశాను. 1955 మార్చి నెలలోనే ప్రిన్సిపాలు సంతకంతో, మరికొన్ని బిల్లులతో వాటినన్నింటిని ట్రెజరీలో సమర్పించి పెద్ద మొత్తాలు పొందాము. మా హెడ్‌గుమాస్తా శ్రీ సైలాస్ (గుంటూరు) అవరోధమైనా శ్రీ చింతలూరు సుబ్రహ్మణ్యంగారు, ఆనాటి ప్రిన్సిపాల్ సహాయ పడ్డారు. ఈ సందర్భంలో అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ భగవాన్‌దాస్ స్మరింపదగినవారు.

## మఱొక సంఘటన

ఒక దినం శ్రీ ఆచార్యులవారు, ప్రత్యేకంగా నన్ను, మా మిత్రులు శ్రీ చల్లా రామారావు ఫిజికల్ డైరెక్టరు, నర్సిపూడి (తూర్పుగోదావరి జిల్లా), ఇంటికి పిలిచి చక్కెర పొంగలి ఆతిథ్యమిచ్చారు. ఆ సమయంలో, ఆచార్యుల వారి తోడల్లుడు శ్రీ ఎస్.టి రామానుజాచార్యులు

మాతో ఉన్నారు. ఆ పొంగలి కల్గించిన పొంగు మాలో నిలకడగా ఉంది. మఱచిపోలేని సంఘటన అది మాకు.

## శ్రీకూర్మనాధుని దర్శనము

అరసవల్లి సూర్యదేవుని దర్శనంతో, శ్రీ కూర్మనాధుని దివ్యదర్శనం మాకు ఆచార్య ద్వయం వల్ల కలిగినది. ఆ దేవుని కటాక్షలేశమే శ్రీ ఆచార్యులతో మా మైత్రీబంధం గట్టి పడటానికి ముఖ్య కారణం

## ఆ నాటి శ్రీమాన్ ఆచార్యులతో అనుబంధం అల్పకాలమే!

శ్రీమాన్ ఆచార్యులతో సాహచర్యం ఒక సంవత్సర కాలం మాత్రమే అయినా, మా అనుబంధం అధికంగా వృద్ధి పొందింది 1955వ జూలై నెలలో, నెల్లూరులో ప్రభుత్వం శిక్షణ కళాశాలను స్థాపించింది. అందువల్ల నాకు బదిలీ వచ్చింది సుమారు ముప్పది ఏళ్లు వారిని కలిసికొనే అవకాశం కలుగలేదు. వారి నుండి వారి దాసోహములతో, నా లేఖలకు జవాబుగా రెండు కార్డులు వచ్చాయి.

అప్పుడు వారి పాండితీపాటవ మెట్టిదో, ఎవరున్నూ గ్రహింపలేదు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో రెండేళ్లు మాత్రం పనిచేసినా, ఎంతో అనుభవం గడించి ప్రైవేటుగా బి.ఏ. డిగ్రీని పొంది, ఆయనను ఆరాధించే మిత్రులను సంపాదించుకొని, తమకొక గౌరవ స్థానాన్ని అక్కడ స్థిరీకరించుకొని వచ్చారని మాత్రం గ్రహించాము.

## శ్రీహరి ఆదిశేషువు *(1913-1998)*

ఆ నాటి సాహితీ మిత్రులు శ్రీహరి ఆదిశేషువు. శ్రీ ఆదిశేషువు శ్రీ ఆచార్యులవారికి ప్రెసిడెన్సీ కళాశాలలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పరిచితులు. ఆంధ్రరాష్ట్ర అవతరణ వల్ల శ్రీకాకుళం వచ్చారు. శ్రీ ఆదిశేషువు కెమిస్ట్రీ లెక్చరరయినా, జానపదసాహిత్యంలో ప్రవేశించి 'జానపదగేయ వాఙ్మయ పరిచయము' అనే గ్రంధం వ్రాసి, తెలుగు భాషాసమితి బహుమతిని పొందారు. వారికి ప్రోత్సాహమిచ్చినవారు డా॥శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (ఫిజిక్స్ ఆచార్యులు). శ్రీ ఆది శేషువు గుంటూరు మెడికల్ కళాశాల నుండి 1968 పదవీ విరమణ పొందారు. "తెలుగు నేల మీద అక్షరాస్యతను పండించిన ఆదిశేషువు" అనే శీర్షికతో వారిని గురించి, ఆంధ్రజ్యోతి దినపత్రికలో (23 సోమవారం, ఫిబ్రవరి 2004) డాక్టరు దేవరాజు మహారాజు వ్రాసిన వ్యాసం వెల్వడింది. వారు వినయసంపన్నులు. వారు వ్రాసిన లేఖను చదివితే, వారెంతటి ఉదాత్తులో గ్రహింపవచ్చు. (అనుబంధంలో ఉన్నది)

శ్రీ ఆదిశేషువును హైదరాబాదులో వారి యింటిలో ఒకసారి కలిశాను. వారితో పనిచేసిన శ్రీ టి. నరసింహాచారి (అనంతపురంవారు) వారికి ఇష్ట సఖుడు.

## అనంతర సమావేశాలు

హైదరాబాదులలో, ధనుర్మాస కార్యక్రమంలో శ్రీమాన్ ఆచార్యులవారు, ఉపన్యాసాలు ఇచ్చే సమయంలో (1987 సం॥) నన్ను కీర్తిశేషులు ఊటుకూరు భానుమూర్తి, జాయింట్ ట్రాన్సుపోర్టు కమిషనర్ (రిటైర్డ్) చిత్తూరువారు, శ్రీ కాకుళంలో పూర్వం హిస్టరీ లెక్చరరు, నన్ను దోమలగూడాకు పిలుచుకునిపోయి శ్రీ ఆచార్యులను మళ్లీ చూచే అవకాశం కల్గించారు. అప్పటికి వారు శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి అని గౌరవింపబడుచున్నారు. ఆ స్వామివారిని సంతోషంతో సందర్శించాను. అపరిమిత ఆనందంతో నన్ను ఆదరించారు. శ్రీమాన్ రామానుజాచార్యులు తోడల్లుడు కూడా ఉన్నారు. వారి కుటుంబ సభ్యులకు నన్ను పరిచయం చేశారు. ఆరోగ్యం బాగుగాలేకపోయినా, మేడమీది మండి దిగి వచ్చి శ్రీ భాను మూర్తికి, నాకు వీడ్కోలిచ్చారు. అట్టిదివారి సౌహార్దం. (శ్రీ భానుమూర్తి ఏకైక పుత్రి చి.సౌ. గాయత్రి. ఆమె భర్త శ్రీ గిరిధర్, ఐ.ఏ.ఎస్.)

విశాఖపట్టణంలో, 1995సం॥ శీలానగర్ వెళ్లి ఆ స్వామి వారి దర్శనం చేసి కొన్నాను. నేను ప్రచురించిన శ్రీ చదలవాడ జయరామశాస్త్రులు రచించిన ఉత్తరహరివంశ ప్రథమాశ్వాస వ్యాఖ్యను ఇచ్చాను. ఇతర ఆశ్వాసాలకు వ్యాఖ్యను త్వరలో ప్రచురింపవలసినదిగా కోరారు. నేనిచ్చిన గ్రంథాన్ని తన కుమార్తెకిస్తానన్నారు. చాలా కృశించి ఉన్నా, వారిలో ప్రసన్నత ప్రస్ఫుటంగా గోచరించింది.

"శ్రీ ఆచార్యులుగారూ, అల్పజ్ఞానిని నేను, నా మీద, నాచనసోముని ఉత్తర హరివంశ వ్యాఖ్యను ప్రచురించే భారం వేసుకొన్నాను... మీ ఆశీస్సు లివ్వండి" అని అర్థించాను.

"శర్మగారూ, ఇతరులకు సాయపడే మీ స్వభావం, ఆ శ్రీనివాసుని కరుణ వల్ల మీ కృషి ఫలిస్తుంది" అన్నారు శ్రీ ఆచార్యులవారు. వారి ఆశీఃప్రభావం వల్ల ఆ కృషి ఫలించింది.

తర్వాత మళ్లీ త్వరలో వారిని కలుసుకోలేకపోయాను. వారి ఆధ్యాత్మిక ఉపన్యాసాలను గుఱించి విశేషంగా శ్రీ మద్రామాయణ ప్రవచనాల గుఱించి, ప్రశంసలను విన్నాను. ఎంతో ఎదిగి ఆళ్వారులైనారనీ ఆనందించాను.

"విక్రమసింహపురి విద్వత్ప్రవరులు" అనే నా గ్రంథంలో (1998 సం॥) ఈ క్రింది మాటలలో వారిని స్మరించాను.

"అచ్చటికి (శ్రీకాకుళానికి) శ్రీ భాష్యం అప్పలాచార్యులు రెండవ గ్రేడు సంస్కృతో పన్యాసకులుగా వచ్చారు. వారితో సంయోగం అదృష్టమే! యోగి సత్తములు. విశాఖపట్టణంలో ఆధ్యాత్మికోపన్యాసాలు ఇస్తూ జనరంజకులై ఉన్నారు".

(ఆ గ్రంథం 1998 సం॥ నవంబరు నెల కడపలో, చార్లెసు ఫిలిప్ బ్రౌను గారికి అంకితమియ్యబడి వారి ద్విశత జయంతి ఉద్యమంలో ఆవిష్కరింపబడింది).

"విక్రమ సింహపురి విద్వత్ప్రవరులు", మఱియు నాచనసోముని ఉత్తరహరివంశ వ్యాఖ్యల సంపుటాలను మూడింటిని, భీష్మస్తవరాజమును శ్రీ స్వామివారికి, విశాఖపట్టణంలో 4-4-2003 తేది స్వయంగా సమర్పించుకొని, వారి అనురాగ దృష్టిని అందుకొన్నాను.

## సహస్ర చంద్రదర్శన మహోత్సవాలు

శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామివారి సహస్ర చంద్రదర్శన మహోత్సవాలు. 2-4-2003 నుండి 11-04-2003 వఱకు విశాఖపట్టణంలో జరిగినవి. ఆ ఉత్సవాలలో నేను పాల్గొనడానికి కారణమైనవారు జస్టిస్ శ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారు. వారు మాటల సందర్భంలో తాము విశాఖపట్టణం వెళ్లుతున్నట్టుచెప్పారు. అప్పుడు నేను శ్రీ ఆచార్యుల వారు మాకు పురాణమిత్రులన్నాను. వెంటనే వారు శ్రీ కె.వి.రామమూర్తి అడ్వొకేటుకు ఫోను చేసి నన్ను ఆహ్వానించవలసినదిగా వారికి సూచించారు. శ్రీమూర్తి, శ్రీమాన్ ఆచార్యులవారితో నా విషయం చెప్పగా "తప్పక రప్పించండి", అని ఆమోదించారట.

ఈ విధంగా చివరిసారిగా శ్రీమాన్ ఆచార్యులవారిని దర్శించుకొనే మహాభాగ్యం కలిగింది. 4-4-2003 తేది జస్టిస్ కోదండరామయ్యగారు అధ్యక్షత వహించినప్పుడు శ్రీమాన్ టి.పి.రామచంద్ర ఆచార్యస్వామి అమోఘంగా ఉపన్యసించారు. నేను, "శ్రీమాన్ అప్పలా చార్యులు, ఆంజనేయ, భీష్మాచార్యుల వంటి మహాయోగులు, నాకు పురాణ మిత్రులు. వారిని గురజాడ కళాక్షేత్రంలో వారి ప్రక్క కూర్చునే భాగ్యం. వారిని గుఱించి నాలుగు మాటలు చెప్పే అవకాశం కల్గినందుకు సంతోషిస్తున్నాను" అని చెప్పాను. శ్రీ ఆచార్యులవారు, శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ రచించిన "ప్రవచన శిరోమణి"ని అనేక మంగళాశాసనములు అని, చలించే వ్రేళ్లతో, సంతకం పెట్టి నన్ను ఆశీర్వదించారు. అప్పటి ఆచార్యుల అరవింద సుందర స్మిత వదనం. నన్ను వారి భవ్యచరితము వ్రాయడానికి ప్రేరకమైంది.

## అకాల మరణం : *7-6-2003*

హైదరాబాదు వచ్చిన వెంటనే శ్రీమాన్ ఆచార్యస్వామివారికి. వారి జీవిత విశేషాలను నాకు తెలిసినవి వ్రాస్తానని లేఖ వ్రాశాను. తర్వాత రెండు నెలల్లో, వారి మరణం 7వ తేది జూన్ నెల జరిగినట్లు పత్రికలలో వెల్వడింది. పూర్తిగా 81 సంవత్సరాలు మాత్రమే జీవించారు. సహస్ర చంద్రదర్శన మహోత్సవాలలో అందరు నూరేళ్లు జీవించాలని ఆశించారు ఇంకా కొన్నేళ్లు వారి ప్రవచనాలను ఆస్వాదించాలని, అభిలషించారు. విధాత వారికి ఆయుర్దాయం అంతే నిర్దేశించారు. శాశ్వతంగా కన్ను మూశారు. విశాఖలో అత్యంత వైభవంగా జరిగిన మహోత్సవాలలో పాల్గొని అమందాహ్లాద బ్రహ్మానంద భరితులైన శ్రీమాన్ ఆచార్యులవారికి అంతకంటె అధికమా స్వర్గలోక సుఖం? భూలోకంలో స్వర్గ సుఖం అనుభవించారు వారి భౌతికదేహం నశించినా, వారి కీర్తికాయం స్థిరంగా ఉంది. వారి మధురస్మృతులు సుధాపాన తుల్యాలు.

ధన్యజీవి శ్రీమాన్ అనంతప్పాళ్వారు స్వామివారు. ఈ చిఱుపొత్తం, మా మైత్రీబంధ చిహ్నంగా వారికే అంకితమైంది. వారి మాహాత్మ్యం మాకు సదా స్మరణీయం. వారి ఆశీః ప్రభావమే మాకు మహా ప్రసాదం. వారి భవ్య చరితమును చదివి వారి గ్రంథాలన్నింటినీ వారి దాసులు ఆదరించి, ధన్యులయ్యెదరు గాక!

## శ్రీభాష్యం వారి వంశక్రమం

మూల పురుషుడు : **శ్రీమాన్ మణవాళ మహామునీంద్రులు**

పితామహుడు : **వేంకట నరసింహాచార్యులు**

| పెద శ్రీనివాసాచార్యులు | | చిన్న శ్రీనివాసాచార్యులు |
|---|---|---|
| భార్య | | భార్య |
| తిరువేంగళమ్మ | | చిన తిరువేంగళమ్మ |
| **సీతమ్మ (అక్క)** | **రాఘవమ్మ (అక్క)** | **అనంతప్పలాచార్యులు** |
| | | *(జననం 6-4-1922* |
| | | *మరణం 7-6-2003)* |
| | | భార్య |
| | | **తిరువేంగళమ్మ** |
| | | *(వివాహం 1935వ సం॥)* |

## ఆచార్యులవారి సంతాన క్రమం

1. తిరువేంగళమ్మ : జననం 20-9-1943, వివాహం ఏప్రిల్ నెల, 1954 సం॥ అప్పుడు ఆమె వయస్సు పదేళ్లు. భర్త · వేంకటనరసింహాచార్యులు
2. శ్రీనివాసాచార్యులు : జననం 1-8-1948వ సం॥, వివాహం 14-6-1966వ సం॥ భార్య : పద్మావతి
3. లక్ష్మి : జననం 1953వ సం॥, వివాహం 1969వ సం॥ భర్త · రాఘవాచార్యులు

**తోడల్లుడు :** శ్రీమాన్ శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులు. వీరి భార్య పేరు జగ్గమ్మ. వీరు శ్రీ ఆచార్య స్వామి కంటె మూడు నెలలు చిన్న. ఇద్దరు శ్రీరామలక్ష్మణుల వలె మెలిగేవారు. వారిది విడదీయరాని అనుబంధం. విష్ణుపథంలో వర్తించే పీఠాధిపతులు శ్రీమాన్ రామానుజాచార్యుల స్వరూపం, శ్రీమద్ రామానుజులను పోలిన బృహత్ సురూపం. సుందరం. స్త్రీ సంతానం ఎక్కువ కుమారుడొక్కడే సంసార భారపు మోత ఎక్కువగా ఉన్నా స్థిరచిత్తతతో వర్తించే ధీరోదాత్తులు.

## "ఆచార్య వరివస్య" అనే వ్యాసం :

శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య వారి సహస్ర చంద్రమాస మహోత్సవాల సందర్భంలో "ఆచార్యోపాయనమ్" అనే పేరుతో విశిష్ట సంచిక ప్రచురింపబడింది. అందులో, శ్రీమాన్ రామానుజాచార్యులు "ఆచార్య వరివస్య" అనే దీర్ఘ వ్యాసంలో శ్రీమాన్ అప్పలాచార్య స్వామిని గుఱించి చాలా సంగతులు చెప్పారు.

# వైష్ణవాచార్యుల చరిత్ర

## శ్రీమన్నాథ మునీంద్రులు

ప్రప్రథమంగా పేర్కొనదగినవారు శ్రీమన్నాథమునులు. శ్రీనివాస పెరుమాళే, శ్రీనాథ మునిగా అవతరించారని వైష్ణవులు విశ్వసిస్తారు. వారే, ద్రావిడప్రబంధ ప్రవక్త. పన్నిద్దఱు అళ్వారుల పాశురాలను (భక్తిగీతాలు) సేకరించి **నాలాయిర** ప్రబంధమనే పేరుతో,.వెలయించిన ప్రకాశకులు. దానికి ద్రావిడవేదమని పేరు. అందు చతుర్వేద సారముందని అందరు దాన్ని

ఆదరిస్తారు. శ్రీనాధమునులు, వ్యాసుని వేదాన్ని ద్రావిడ వేదాన్ని మధించిన మహామహులు. కనుక ఉభయ వేదాంతులని వారికి కీర్తి సిద్ధించింది.

## శ్రీయామునాచార్యులు (976 సం॥)

శ్రీనాధమునుల కుమారులు, శ్రీయామునాచార్యులు. వీరికి "ఆళవందార్" అనియు పేరున్నది. వారికి అష్టాక్షరిని బోధించిన దేశికుడు శ్రీరామమిశ్రులు. శ్రీయామునుల మేధా సంపత్తి అద్వితీయం. వారి శిష్యులు అయిదుగురికి పంచనంబులని పేరు. వారందరు, శ్రీమద్రామానుజులకు గురువులై పేరు పొందారు. శ్రీమన్నాధ మునీంద్రులు తన తర్వాత శ్రీరంగ వైష్ణవ పీఠానికి శ్రీమద్రామానుజులను అధిపతిని చేశారు.

## శ్రీమద్రామానుజులు (1017-1137)

శ్రీ పెరుంబుదూరులో (చెన్నైకి సమీపగ్రామం) శ్రీమాన్ రామానుజులు జన్మించారు. "యతిరాజు" అని కూడా వారికి విఖ్యాత నామం కులం, వర్ణం, మతం అనే వ్యత్యాసాలను విచ్ఛిన్నం చేసిన విశాల హృదయులు. భారతదేశంలో సమైక్య జాతీయభావం, పటిష్టంగా ప్రచారం చేసిన మహామహిమోన్నత ఉదాత్త గంభీర హృదయులు. జీవితంలో ఎన్నో కష్టాలను రుచి చూశారు తాను నమ్మిన సూత్రాలు, 'విశ్వసోదర భావం', 'అంటరానితనం నిర్మూలనం' మొదలైనవానిని ఆచరణలో పెట్టిన శ్రామికులు. మానవత రూపొందిన ఆచార్యమూర్తి. ఏకాంత భక్త ప్రబోధకుడు, జాతిని మేల్కొల్పిన వైజ్ఞానికుడు. వేదవ్యాసుని బ్రహ్మసుత్రాలకు "శ్రీ భాష్యం" అనే పేరుతో బృహత్వ్యాఖ్యను, ఉపనిషత్తులకు, భగవద్గీతకు వ్యాఖ్యలు, ఇతర గ్రంధాలను, కొన్ని సంస్కృతంలోను, కొన్ని మణిప్రవాళ భాషలోను, మఱికొన్ని తమిళంలోను రచించారు. శ్రీ విశిష్టాద్వైత వేదాంత ప్రబోధకులలో మేటి తన గురువు శ్రీ యాదవ ప్రకాశులను వేదాంత విషయాలలో ప్రతిఘటించిన ప్రజ్ఞాశాలి. విశ్వవిఖ్యాత శ్రీమద్ రామానుజులు నూట ఇరవై ఏళ్లు జీవించిన అసాధారణ మానవాతీత ప్రతిభా భాస్వంతుడు.

## శ్రీమాన్ మణవాళమహాముని

**శ్రీమాన్ అప్పలాచార్యుల వంశానికి మూలపురుషులు.** కౌండిన్య గోత్రులు. శ్రీరంగం శ్రీరంగనాధుని దేవాలయంలో నిత్యకైంకర్య నిర్వాహకులు. వీనులవిందుగా, భక్తులకు భగవద్విషయాలను ప్రబోధించిన వాక్పటిమగల ప్రవక్త. వారి సమకాలికులు, శ్రీమాన్ పిళ్లై లోకాచార్యులు సుదర్శనభట్టరు. భక్తి కంటె ప్రపత్తి (శరణాగతి) ప్రధానమని నూతన సూత్రాలను ప్రతిపాదించి, విశిష్టాద్వైతానికి నూతనోత్తేజం సమకూర్చారు. ముష్కరతురుష్కులు శ్రీరంగ

ధామమును ధ్వంసము చేసినప్పుడు, అప్పటి విపత్తులో విరోధులను ఎదుర్కొని తమ ప్రాణాలను అర్పించిన అమర విష్ణుదాసులు, ఆ ముప్వురు.

## శ్రీమాన్ వేదాంత దేశికులు (1268-1369)

వీరికి వేంకటనాధుడనియు పేరు. వైఖానసులు (వడగళైవారు). పై ముప్వురును తెంగళైశాఖకు చెందిన పాంచరాత్రులు. శ్రీమద్ రామానుజుల శ్రీ భాష్యానికి, శ్రీమాన్ సుదర్శన భట్టరు రచించిన "శ్రుత ప్రకాశిక"ను తురుష్కుల దాడి నుండి దాచుటయే గాక, శ్రీ వేదాంత దేశికులు, శ్రీ భట్టరు కుమారులు చిరంజీవి వేదాచార్య, పరాశరాభట్టరులను, తన్ను, శవాల క్రింద పండుకొని రక్షించుకొన్న సాహసౌదార్యమూర్తి ఎన్నో గ్రంధాలను రచించారు. వానిలో సంస్కృత బృహద్గ్రంధము "యాదవాభ్యుదయము" (శ్రీ కృష్ణ చరిత్రము). వీరు శ్రీమద్రామానుజులను "యతిరాజ సప్తతి"లో చక్కగా స్తుతించారు.

## "శ్రీ భాష్యం" - ఇంటి పేరు

శ్రీమద్రామానుజుల బ్రహ్మసూత్రాల "శ్రీ భాష్యాన్ని" ప్రవచించిన ప్రవీణులు, శ్రీమాన్ అప్పలాచార్యుల వంశీయులు. కనుకనే వారికి వంశపారంపర్యంగా చాలా కాలం నుంచి ఆ పేరు నిలిచింది.

## పూర్వుల ప్రాచీన నివాసం

శ్రీమాన్ అప్పలాచార్యుల పూర్వులు నలభై కుటుంబాలవారు. తమిళ దేశానికి చెందిన వారు. కాంచీపురానికి సమీపంలో ఉండే "తూపిల్" వారి పూర్వుల నివాసం. తెలంగాణాలో ఉండే "రాచకొండ" రాజు వైష్ణవ మతాభిమాని. వారిని తమ రాజ్యానికి రప్పించి ఆశ్రయ మిచ్చారు. వారందరు శ్రీమాన్ మణవాళమహాముని ఆదేశానుసారం, వలస వచ్చారు. వారిలో మూడు కుటుంబాలదే, కౌండిన్య గోత్రం. విచిత్రంగా ఆ మూడింటిలో ఒక కుటుంబం వారికే "శ్రీ భాష్యం" అనే పేరు రూఢి అయింది. వారే "మరడం" గ్రామం బ్రహ్మదేయంగా పొందారు.

## శ్రీ అనంతప్పడి జన్మ వృత్తాంతం

శ్రీమాన్ చిన్న శ్రీనివాసాచార్యులు. శ్రీమతి చిన తిరువేంగళమ్మ దంపతులకు మొదట ఇద్దరు ఆడబిడ్డలు. సీతమ్మ, రాఘవమ్మ కలిగారు. మగబిడ్డ లేదనే వ్యధ వారిని పదుమూడేళ్లు బాధించింది. పద్మనాభంలో వారి నివాసం. కొండదిగువ శ్రీ మాధవస్వామి ఆలయం ఉంది.

ఆ కొండకొనయే ఆదిశేషుని పడగ. ఆ పడగ క్రింద శంఖచక్ర చిహ్నాలున్నవి ఆ దంపతులు పద్మనాభంలోని దేవులను, ఆరాధించిన పిమ్మట దీక్షతో సింహాచలంలోని శ్రీ వరాహ లక్ష్మీనరసింహస్వామిని ఆశ్రయించారు. ఆ దంపతులు (40, 45 సంవత్సరాలు) కాలి నడకతో కొండ యెక్కి ఆషాఢశుద్ధ పౌర్ణమినాడు స్వామి దర్శనం చేసుకొన్నారు శ్రీ కుంతీ మాధవస్వామి కృపాదృష్టి, శ్రీ అనంతపద్మనాభ స్వామి అనుగ్రహ వీక్షణం, శ్రీ సింహాచలం స్వామి కరుణారస ప్రసారం సమాహారమై ఆ సుకృతులకు శ్రీరాముడే సుతుడై అవతరించాడు.

## జనన కాలం : 6-4-1922 శ్రీరామనవమి

దుందుభినామ సంవత్సరం చైత్రశుద్ధ నవమి, బుధవారం రాత్రి పునర్వసు నక్షత్ర చతుర్థపాదయుక్త మకర జన్మ లగ్నంలో చిరంజీవి జన్మించాడు. త్రేతాయుగంలో పుడమి మీద శ్రీరామచంద్రుడు అవతరించిన శుభసమయమది. శ్రీరామనవమి పర్వదినం రాశిలగ్నం కర్కాటకం. తత్కాల గ్రహసంపత్తిని పరిశీలించిన దంపతులు దైవానుగ్రహంచే కలిగిన మగ శిశువు మహా యోగజాతకుడని గ్రహించి సంతసించారు. సర్వలక్షణ సంపన్నుడు అయిన బాలుడు దివ్యచిహ్నాలతో తేజస్వంతుడై అందరిని ఆకర్షించాడు.

## రాశిచక్రంలో గ్రహస్థితి : కర్కాటక లగ్నం

**మేషంలో** శుక్రుడు; **వృషభంలో** రవి, బుధ కేతువులు

**కన్యలో** కుజుడు; **ధనుస్సులో** గురు, శని రాహువులు

**మకరంలో** చంద్రుడు

## నామకరణం - అనంతఅప్పలాచార్యులు

జన్మించిన బాలునికి పద్మనాభస్వామి పేరు, సింహాచలేశుని పేరు, రెంటిని కలిపి, అనంత అప్పలాచార్యులు అని పేరు పెట్టినారు. వ్యవహారంలో అది "అనంతప్పడు" అయింది.

## విద్యాక్రమం

**తొలిగురువు :** తల్లి శ్రీమతి చినతిరువేంగళమ్మ. సరళమైన సుమతీశతకం, శ్రీకృష్ణ శతకం మఱియు శ్రీ కులశేఖరాళ్వారుల ముకుందమాల స్తోత్రం వల్లించడం నేర్పించారు. ఆదిలోనే చిరంజీవి అనంతప్పడికి శ్రీకృష్ణ భక్తి గట్టిపడింది మాతృ ప్రసాదం వల్లనే, నిత్యజీవితంలో ఆచార్యులు భగవత్సేవలోనే నిమగ్నులయ్యారని తలంపవచ్చును. అయితే ఆమె అయిదేళ్లకే

అర్భకుడిని వదలి అనంతలోకాలకు వెళ్లారు అయినా, పెదనాన్న, పెదతల్లి, తండ్రి, ఆ చిరంజీవి అనంతప్పడిని అత్యంతానురాగంతో అల్లారుముద్దుగా పెంచారు

### ప్రాథమిక విద్య : 1927–1930

**పద్మనాభం** (విజయనగరం జిల్లా) . మూడవ తరగత వఱకు మాత్రమే పద్మనాభంలో బడి చదువుసాగింది.

**బోధకులు** : శ్రీ అకొండి సత్యనారాయణమూర్తి, శ్రీ గురువానాయుడు.

**ముగుళ్ల** (పశ్చిమగోదావరి జిల్లా) : ఉపనయనమైన వెంటనే ముగుళ్లలో శ్రీ పెద్దింటి జగన్నాధాచార్యులు శబ్దమంజరి, రఘువంశకావ్యాలను కొంతకాలం బోధించారు. అక్కడే సంస్కృత భాష యందు చక్కని పునాది ఏర్పడింది.

### విద్యాప్రవీణ : 1930 – 1940

**విజయనగరం :** ఆంధ్రదేశంలో ప్రసిద్ధ విద్యాలయం విజయనగరం సకల కళాప్రియులు గజపతులు ప్రాచీన శాస్త్రవిద్యలను ప్రోత్సహించారు సంస్కృత కళాశాల, సంగీత కళాశాల, ఆర్ట్సు కళాశాల వారు నెలకొల్పినవే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు విద్యా ప్రవీణ పట్టా కోసం సంస్కృత కళాశాలలో ప్రవేశం పొందారు. పెద్ద తల్లి శ్రీమతి తిరువేంగళమ్మ తన కుమారుని చదువు కోసం, విజయనగరంలో కాపురం పెట్టినందువల్ల, శ్రీ భాష్యం వారు వారి యింటిలోనే అయిదేళ్లుండినారు తర్వాత మిగిలిన అయిదేళ్లు విడిగా అక్కగారితో ఉండి చదువు పూర్తి చేసుకొన్నాడు. సంస్కృత "వ్యాకరణ విద్యాప్రవీణ" పరీక్షను ద్వితీయశ్రేణిలో 1940 సం॥లో ఉత్తీర్ణులయ్యారు.

## సంస్కృత కళాశాలలో ఆచార్యులు

1. మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ తాతాసుబ్బరాయశాస్త్రి ఆనాటి వారిలో అగ్రేసరులు. షట్‌శాస్త్రకోవిదులు పేరూరు ద్రావిడ శాఖకు చెందినవారు.
2. శ్రీమాన్ కోయిల కందాడై వేంకట రామానుజాచార్యులు. వైయాకరణి వైష్ణవులు.
3. బ్రహ్మశ్రీ అప్పల జోగన్నశాస్త్రి, వ్యాకరణ పండితులు. వీరి విపులపాణిని అష్టాధ్యాయి వివరణం, "కౌముదీశరదాగమము" మిక్కిలి ప్రామాణికమైనది (4 సంపుటాలు). పేరూరు ద్రావిడులు. వీరి సమీప బంధువు శ్రీ అప్పలసోమేశ్వరశర్మ (సహాధ్యాయి).
4. బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వర శాస్త్రి వ్యాకరణ పండితులు పేరూరు ద్రావిడులు.

5. బ్రహ్మశ్రీ వేదాంతం శేషయ్యశాస్త్రి. న్యాయశాస్త్ర కోవిదులు. వెలనాటి శాఖకు చెందిన వారు.

6. బ్రహ్మశ్రీ కట్టి శ్రీరామమూర్తి శాస్త్రి. వ్యాకరణ మీమాంసా న్యాయశాస్త్రజ్ఞులు. పేరూరు ద్రావిడులు.

7. బ్రహ్మశ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రులు. జననం 22-01-1904. బురద వెంకటాపురం, గజపతినగరం తాలూకా. తర్కం, వ్యాకరణం దశాబ్దము కాశీలో అధ్యయనము. సాహిత్య శిరోమణి (ప్రథమ) – మద్రాసు.

వీరికి ఖాదీశాస్త్రి, శృంగారశాస్త్రి, చరిత్ర చతురానన అనే బిరుదులు కలవు. స్వాతంత్ర్య సమరయోధుడు. కేరళలో గాంధీ మార్గ ప్రచారకులు. పుస్తక ప్రచురణ సంస్థను నెలకొల్పి (జి.ఎస్.శాస్త్రి అండ్ కో.) 11 శృంగారకథలు, ఒక భావ కవిత్వ గ్రంథము, కొన్ని మత గ్రంథములను ప్రచురించిరి. శ్రీ బసవరాజు అప్పారావు ఆదరణ పొందిరి. శ్రీ నండూరి సుబ్బారావు "ఎంకి పాటలు" అనే గ్రంథాన్ని 1929సం॥ ప్రచురించారు. వ్యాపారంలో సర్వస్వం కోల్పోయారు. శ్రీ శ్రీ శ్రీ పూసపాటి విజయరామ గజపతిగారి మాతృమూర్తి రాణీ విద్యావతీ దేవిగారి మన్ననలతో "కళింగ విజయనగర చరిత్ర" 1400 పుటల గ్రంథం రచించారు (అముద్రితం). 1938సం॥ కొన్ని చరిత్ర గ్రంథాలు కూడా రచించారు. వారి "సింహాచల చరిత్ర" (ముద్రితం)ను, వారి పుత్రులు కీ.శే. శ్రీరామమూర్తి ఆంగ్ల భాషలోనికి అనువాదం చేశారు. 1951 సం॥ భగవద్గీత మేలుకొలుపులు వ్రాసినారు. ఊపిరితిత్తుల వ్యాధికి వశులై, 27-09-1953 తేది యాభై ఏళ్లు నిండక ముందే కన్ను మూసినారు. పేరూరు ద్రావిడులు.

## సంస్కృత కళాశాల అధ్యక్షులు (ప్రిన్సిపాలు)

1. శ్రీమాన్ కిడాంబి రామావతారం (ఒక సంవత్సరం)

2. శ్రీమాన్ పరవస్తు వేంకట రామానుజస్వామి (తొమ్మిదేళ్లు). వీరు తిరుపతి ఓరియెంటల్ కళాశాలలో ప్రిన్సిపాలుగా పనిచేశారు. వీరి కుమారుడు డా॥పి.ఎస్.చారి, గొప్ప సర్జన్ హైదరాబాదులో నున్నారు.

## సంగీత కళాశాల ప్రిన్సిపాల్

శ్రీమాన్ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు. హరికథా పితామహులు. వీరి బంధువు అజ్జాడ నాగభూషణరావు, డా॥నేలటూరు వేంకటరమణయ్య పర్యవేక్షణలో పి.హెచ్.డి. పట్టా పొందారు. ద్రావిడులు.

## ఆర్ట్సు కళాశాల ప్రిన్సిపాల్

బ్రహ్మశ్రీ బుఱ్ఱా శేషగిరిరావు

డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, మహారాజావారి కళాశాలలో 1942-1952లలో ప్రాచ్య భాషలకు ఆచార్యులు. శ్రీమాన్ అప్పలాచార్యులను విద్యార్థి దశలో బాగుగా ఎఱిగినవారు.

## స్వామివారి సహాధ్యాయులు :

1. బ్రహ్మశ్రీ అప్పల సోమేశ్వరశర్మ, వ్యాకరణ విద్యాప్రవీణ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులు. స్వర్ణపతాక గ్రహీత. 2002 సం॥లో సహస్ర చంద్ర మహోత్సవం జరిగింది.

2. బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వర శర్మ - ద్రావిడులు

3. బ్రహ్మశ్రీ పేరి కూర్మనాథం - ద్రావిడులు

4. శ్రీమాన్ తూపురాణి పట్టాభిరామాచార్యులు - శ్రీ వైష్ణవులు

5. శ్రీమాన్ నిడమర్తి కందాడై భాష్యకాచార్యులు - శ్రీ వైష్ణవులు

6. బ్రహ్మశ్రీ ఓరుగంటి సుబ్రహ్మణ్యం (తెలగాణ్యులు)

విజయనగరంలో "విద్యాప్రవీణ" చదువు అయిన తర్వాత, ఎస్.ఎస్.ఎల్.సి. (11వ తరగతి) ప్రయివేటుగా, భాషాప్రవీణ (1944) ప్రయివేటుగా, తెలుగు పండిత శిక్షణము రాజమహేంద్రవరం కళాశాలలో (1946 సం॥) (ఆరు నెలల చదువు), ఇంటర్మీడియట్ (1952) ప్రయివేటుగా, బి.ఏ. (1954) ప్రయివేటుగా, ఎమ్.ఏ. కాశీ విశ్వవిద్యాలయం, వారణాసి 1958 సం॥లో పూర్తి చేశారు.

## ఉద్యోగం - సద్యోగం (1940)

ఉద్యోగ జీవితం ప్రారంభమయ్యేటప్పుడు శ్రీమాన్ శ్రీభాష్యం వారి వయస్సు పద్దెనిమిదేళ్లు. కుటుంబ నిర్వహణ బాధ్యత వల్ల ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచుకొనడానికి చిన్న వయసులోనే అక్టోబరు మాసం, 1940వ సం॥లో ఉద్యోగ ప్రవేశం అవసరమైంది.

**1. పుట్టుకొండ (వల్మీకాద్రి), (తూర్పుగోదావరి జిల్లా) :** రెండేళ్లు. 1940-41, 1941-42. పుట్టుకొండ శ్రీ లక్ష్మీనరసింహస్వామి వారి క్షేత్రం దేవస్థానం సంస్కృత పాఠశాలలో సంస్కృతం బోధించారు. శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి కటాక్ష ప్రభావం బాగా వారిపై

ప్రసరించింది. కాకినాడ, పుట్టుకొండకు ఎనిమిది మైళ్ల దూరం. తొలి ఉద్యోగ రంగం – ఆ కాకినాడ అంటే అతిశయోక్తి కాదు. ఆ సమీప గ్రామమే ఆచార్యుల ధర్మవీర నాట్యాంగణం, శ్రీమద్రామాయణ ప్రవచన ప్రాంగణం. అచ్చోటే అత్యుచ్ఛ పరమోల్లాసభరిత జీవిత పరిమళ ప్రచారానికి, పునాదులు పడ్డాయి. ఆ నాడు వారి ఎదలో పిండరూపమైన ఆధ్యాత్మిక విలాసప్రభలు, విశాఖలో విస్తరించి నిబిడమై, సర్వవ్యాప్తమైనాయి. శ్రీ వల్మీకాద్రిస్వామి సేవలో ప్రతిష్ఠితమైన చిత్తశుద్ధి శ్రీరామచంద్రుని భక్తిలో సంవదించి ఫలించింది.

**2. పద్మనాభం (విజయనగరం జిల్లా) :** ఆఱు మాసాలు. 1942 సం॥. ఇది స్వస్థానం. శ్రీ అనంత పద్మనాభస్వామి వారి క్షేత్రం. దేవస్థానం పాఠశాలలో ఆఱు నెలలు సంస్కృతాన్ని బోధించారు.

**3. శ్రీకూర్మం (శ్రీకాకుళం జిల్లా) :** 1942–43 సం॥ శ్రీ కూర్మనాధస్వామి వారి క్షేత్రం. శ్రీ మద్రామానుజులు సముద్ధరించిన శ్రీ వైష్ణవాలయం. దేవస్థానం పాఠశాలలో 1 సం॥ సంస్కృతాధ్యాపకులు.

**నిరుద్యోగ కాలం :** 1944–1945 సం॥. తెలుగు పండిత పదవికి "భాషాప్రవీణ" మఱియు "తెలుగు పండిత శిక్షణ" రెండు అవసరమైన యోగ్యతలు. కనుక 1944 సం॥ ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి "భాషాప్రవీణ" పట్టా పొందారు. తర్వాత రాజమహేంద్రవరంలో ప్రభుత్వ పండిత శిక్షణ 1946లో చేశారు. జీవితమనే కంప తొడుగును లాగుకొంటూ సుమారు రెండు సంవత్సరాలు సంసార నిర్వహణలో, పితృసేవలోను సర్వం శ్రీ కృష్ణార్పణమనే భావంతో కాలక్షేపం చేశారు.

4. శ్రీకాకుళం మున్సిపల్ ఉన్నత పాఠశాలలో సుమారు 3సం॥ (1946–49) రెండవ గ్రేడు తెలుగు పండిత పదవి లభించింది. 1947లో పితృ వియోగం. అప్పుడు తండ్రి వయస్సు 70 ఏళ్లు.

5. చోడవరం జిల్లా బోర్డు హైస్కూలులో (విశాఖ జిల్లా) ఆఱు మాసాలు. 1949–50.

6. శ్రీకాకుళం, మున్సిపల్ ఉన్నత పాఠశాలలో 1950 సం॥ అదృష్టలక్ష్మి శ్రీ ఆచార్యులను వరించింది. మొదటి గ్రేడు తెలుగు పండిత పదవి లభించింది యోగకాలం ఆరంభమైందని అందరూ సంతోషించారు.

## కళాశాల ప్రవేశం

**1. శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాల - శ్రీకాకుళం జిల్లా : సుమారు 1 సం|| (1951 సం||)**

నూతనంగా శ్రీకాకుళం జిల్లా ఏర్పడింది. అందులో రెండవగ్రేడు సంస్కృత ఉపన్యాసక పదవిలో నియమింపబడ్డారు. అది డిగ్రీ కళాశాల. టౌనుహాలులో ప్రారంభమైంది. వారే తొలి సంస్కృతాచార్య పదవిని అలంకరించిన అధ్యాపకులు.

**2. ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసు - రాష్ట్ర కేంద్రం - 2 ఏళ్లు. (1952-53)**

శ్రీవాసా అణ్ణప్పశాస్త్రి, శ్రీకాకుళానికి మార్పు పొందినందువల్ల శ్రీమాన్ ఆచార్యుల వారికి మద్రాసు బదిలీ వచ్చింది.

ఈ మార్పు ఆ నాటి పరిస్థితుల్లో బాధాకరమైనా, వారి అంతర్గత బోధన శక్తులు బహిర్గతం కావడానికి తోడ్పడింది. తాము, ఎమ్.ఏ. (సంస్కృతం) కాకపోయినా, ఎమ్.ఏ. సంస్కృత విద్యార్థులకు ఆంగ్లభాషలో బోధించే అవకాశం కలిగింది. దీనివల్ల ఏకకాలంలో, ఆంగ్ల భాషలో ప్రావీణ్యం, తాను బోధించే పార్యాంశాల విజ్ఞానాభివృద్ధి, బోధనాపాటవం, సమకూరినవి. తర్వాత తనకు, ఇంటరు, బి ఏ , ఇంగ్లీషు పేపర్లు వ్రాయడానికి ఎమ్.ఏ. (సంస్కృతం) డిగ్రీ పొందడానికి ఉపకరించాయి.

## సహాధ్యాపకులు

ఆచార్యులు డా||శంకరన్, సంస్కృత శాఖ.

ఆచార్యులు శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు (కర్నూలుజిల్లా వారు) తెలుగు శాఖ.

శ్రీ జి.నారాయణస్వామి రెడ్డి (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులయినవారు), శ్రీ విశ్వనాథ్ నరసింహంగారు (విశాఖ జిల్లావారు. వీరు సంస్కృత హరివంశానికి, యథా మూలంగా తెలుగు పద్యకావ్యం రచించిన కవిశేఖర బిరుదాంకితులు). శ్రీ పి.ఎస్.ఆర్ అప్పారావు, శ్రీమాన్ ప్రగడ శేషశాయి, శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తి, శ్రీ మల్లంపల్లి శరభయ్య (శ్రీ అప్పాజోస్యుల విష్ణుభట్ల పురస్కార గ్రహీత) మొదలైనవారు అక్కడ అప్పుడు పని చేశారు.

## బ్రహ్మశ్రీ బులుసు వేంకటరమణయ్య - శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు

ప్రసిద్ధ వావిళ్ల పుస్తక సంస్థతో పెనవేసుకున్న సత్సంబంధం కల పండిత ప్రకాండులు శ్రీ బులుసు వేంకట రమణయ్య. వీరిది కాకినాడ. మద్రాసులో స్థిరపడ్డారు. వావిళ్ల వాఙ్మయ సేవ కావించిన కర్మయోగులు. కెల్లెట్ హైస్కూలు ట్రిప్లికేన్‌లో పనిచేశారు. ఈ రచయితకు

పరిచితులు. తిరువళిక్కేణిలో కాపురముండేవారు. శ్రీమాన్ శ్రీ భాష్యం వారితో వారికి పరిచయ మేర్పడింది. తత్ఫలితంగా ఇరువురు వావిళ్ల సంస్థకు "వైజయంతి" అనే నిఘంటువును రచించి యిచ్చారు. బహుశా శ్రీమాన్ శ్రీ భాష్యము వారి ఆది రచన అదే కావచ్చు. వారు మరొక గ్రంథం కూడా వావిళ్ల వారికి వ్రాసి ప్రచురణకిచ్చారు.

### 3. శ్రీకాకుళం, ప్రభుత్వ కళాశాల 1954 సం॥

శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాలలో శ్రీవాసా అణ్ణప్పశాస్త్రి పదవి నుండి విరమణ పొందారు. ఆంధ్రరాష్ట్రం అవతరించింది. శ్రీమాన్ శ్రీ భాష్యం వారు మద్రాసు నుండి స్థానచలనం తప్పించుకొనలేకపోయారు. ఆంధ్రులను, మద్రాసు ప్రభుత్వం, ఆంధ్రకు పంపే పద్ధతిని అమలు పరిచింది. అందువల్ల, శ్రీమాన్ ఆచార్యులు శ్రీకాకుళం కళాశాలలో రెండవసారి రెండవ గ్రేడు సంస్కృత ఉపన్యాసక పదవిలోనే చేరారు. తమ కిష్టమైన ప్రదేశమే శ్రీకాకుళం. పద్మనాభానికి సమీప పట్టణం. నాగావళీ తీరస్థం. శ్రీకూర్మనాథ, శ్రీ సూర్యనారాయణ క్షేత్రాలకు కూడా చాలా దగ్గర ఉన్న చోటు. "అంతా మనమంచికే" అనే అభిమానంతో అచ్చట జీవితాన్ని సంతృప్తితో సాగించారు.

## ప్రభుత్వ కళాశాలలో పనిచేసిన కళాశాలాధిపతులు

1 శ్రీ ఎస్.ఎమ్.ఫజులుల్లా (ఉర్దూ) మద్రాసువారు, తొలి కళాశాలాధ్యక్షులు. అందరి యెడల మర్యాద చూపెడి మృదు హృదయులు. సనాతనాచార ప్రవీణులు.

2. శ్రీమతి దేవకీ దామోదరన్ (కేరళ) నెమ్మది మగువ. ప్రిన్సిపాల్ పదవిలో చాలా తక్కువ కాలమే ఉన్నారు. ఆంధ్ర రాష్ట్ర అవతరణతో మార్పు వచ్చింది.

3. శ్రీ ఆర్.కె.బాబు (లెక్కలు) తాత్కాలిక ప్రిన్సిపాల్ – మూడునెలలు, 1953 సం॥

4. శ్రీ చింతలూరు సుబ్రహ్మణ్యం (లెక్కలు) (రాజమహేంద్రవర వాస్తవ్యులు) రచయితకు పూర్వ పరిచితులు. ఏకాకిగా దర్జాగా, ఏకాంతవాసం, శ్రీకాకుళం కళాశాల మేడపైన గడిపినారు. ఎప్పుడైనా, ఎవరైనా, దేనికైనా వారిని అర్థిస్తే అనురాగంతో ఆదరించే మహానుభావులు. అట్టివారు నేడు అరుదు.

5. శ్రీ వి. హబీబుల్లా (కర్నూలువారు) – అర్థికశాస్త్రం. 1955న శ్రీకాకుళానికి బదిలీ పొందారు. క్రమం తప్పక నమాజ్ చేసెడివారు. నిర్మలుడు. నిరాడంబరుడు.

తెలుగుశాఖలో మొదట నియమింపబడిన మొదటి గ్రేడు ఉపన్యాసకులు ఏ.నాగభూషణ రావు (కడప). వారి స్థానంలో శ్రీ వి.వి సుబ్రహ్మణ్య శర్మ (రచయిత) 1952 సం॥ నవంబర్ నెలలో వచ్చినారు. తర్వాత శ్రీ కె.వి.రామకృష్ణ, ఎమ్.ఏ. ట్యూటరుగా చేరినారు. ఇతడు రచయితకు రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో విద్యార్థి.

1955 సం॥ జూలై నెలలో శ్రీ వి.వి సుబ్రహ్మణ్య శర్మకు (రచయిత) నెల్లూరు ప్రభుత్వ శిక్షణ కళాశాలకు బదిలీ వచ్చింది. స్వంతజిల్లా, తల్లిదండ్రుల దగ్గర ఉద్యోగం చేసే అవకాశం ప్రమోదకారణమైంది.

తర్వాత, సన్నిహిత మిత్రులైన శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యుల వారిని చాలాకాలం కలుసుకొనేందుకు వీలు కలుగలేదు. కాని మా గాఢ మైత్రీబంధం యధాతధంగా ఉండి పోయింది. ఆ నాటి మిత్రులు శ్రీ చల్లా రామారావు (ఫిజికల్ డైరెక్టరు), నాతో శ్రీమాన్ ఆచార్యుల యింట్లో చక్కెర పొంగలి ఆరగించినవారు, తన భార్య కనకదుర్గతో ఒకనాటి విశాఖసభలో శ్రీవారికి కిరీటధారణ చేయించి, శంఖచక్రాలు సమర్పించారు. మిత్ర ప్రేమ వారిచే ఇట్టి సన్మానం చేయించింది. ఇదెంతో గుర్తింపదగిన సత్కార్యం. సంతానం లేని శ్రీ చల్లా రామారావును హైదరాబాదులో, ఒక్కసారి ఈ రచయిత కలిసి, శ్రీకాకుళంలో తమ అనుభూతులను స్మరించుకొన్నారు.

## కాకినాడ : పిఠాపురం రాజావారి ప్రభుత్వ కళాశాల, 1958 సం॥

శ్రీమాన్ అచార్యస్వామి వారు ఎమ్.ఏ., అర్హత యున్నందువల్ల 1958 సం॥ మొదటి గ్రేడు ఉపన్యాసకులుగా పదోన్నతి, కాకినాడ ప్రభుత్వ కళాశాలలో లభించింది. కాకినాడ ప్రముఖ విద్యాకేంద్రం. "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" అనే సాహితీ సంస్థ ఉన్న నగరం. అదొక పత్రికను కూడా నిర్వహించింది. శాసన పరిశోధకులు బ్రహ్మశ్రీ జయంతి రామయ్య పంతులు నివసించిన యూరది. పరిషత్తు, బ్రహ్మశ్రీ వేదం పట్టాభిరామశాస్త్రుల ధాతుమాలను (సూరి కృతమని) ప్రచురించింది. నిడదవోలు వేంకటరావు ఆ భ్రమను సవరించారు. బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి, బ్రహ్మశ్రీ జటావల్లభుల పురుషోత్తం (వీరు ఎమ్.ఎస్.వి. సూర్యనారాయణమూర్తి బావగారు – శ్రీ మూర్తిగారు కర్నూలులో తెలుగు లెక్చరర్), బ్రహ్మశ్రీ ఆకెళ్ల శేషాద్రి, బ్రహ్మశ్రీ వేంకటేశ్వరులు, బ్రహ్మశ్రీ బులుసు వేంకటేశ్వరరావు, బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, బ్రహ్మశ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి, మహర్షి శ్రీశ్రీశ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు (బ్రహ్మసమాజ స్థాపకులు) మొదలగు మహానుభావుల నిలయమది. కాకినాడలో 1958వ సం॥ నుండి 1961వ సం॥ వఱకు పనిచేశారు. ఆ

కాలంలో తిరుప్పావై మహత్వాన్ని, తమ మధురోక్తులచే ముప్పది పాశురాలసారాన్ని పురవాసులచే, మత్తుగొలిపే విధంగా త్రాగించారు. మఱచిపోని అనుభూతులకు వశులై వారందరు శ్రీ ఆచార్యుల యెడ మమతను స్థిరపరచుకొన్నారు. ఆ విధంగానే శ్రీమద్రామాయణ భారత, భాగవత ప్రవచనాలను వినిపించారు. ఆ పురవాసులు శ్రీ మాన్ ఆచార్యులలో తాము ఆరాధించే దైవాన్ని సందర్శించారు.

## రాజమహేంద్రవరం ప్రభుత్వ కళాశాల : 1961 సం॥ – 1966 సం॥

దానవాయ్‌పేటలో, నూతన భవనాలలో ప్రభుత్వ కళాశాల. ఎంతో విశాలమైన ప్రదేశంలో చూడముచ్చటగా ఉంది. అక్కడికి శ్రీమాన్ భాష్యం వారికి 1961 సం॥ మార్పు వచ్చింది. అనంతరం అక్కడ ఉన్నప్పుడే వారికి గెజిటెడ్ హోదా వచ్చింది. గౌతమీ తీరస్థం. ఆదికవి నన్నయ్య, శ్రీనాధులు, కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వడ్డాది పాపయ్య, ప్రయాగ వేంటకరామశాస్త్రి, మొక్కపాటి ఇంకా ఎందరో ప్రఖ్యాతులు సంచరించిన విహార భూమి రాజమహేంద్రవరము. సాహితీగోష్ఠులు నిరంతరం సాగే ప్రదేశం. గౌతమీ గ్రంధాలయం, వీరేశలింగ గ్రంధాలయం. చారిత్రక పరిశోధక సంస్థలు వెలసిన మహానగరం. కాకినాడలో, తమ ప్రసంగాలచే పౌరులను సమ్మోహితులను చేసిన శ్రీ ఆచార్య స్వామివారు, రాజమహేంద్రవరంలోను, అమితోత్సాహంతో ఎప్పటివలె తమ శ్రీమద్రామాయణ ప్రవచనాలచే పురవాసులను అలరింపజేశారు. శ్రీ తిరుప్పావై పాశురాల సౌరభాన్ని కూడా ప్రసరింపజేశారు. సామాన్యులు, స్వాములు, ధీమంతులు, వారి కుమార్తెలు, కుమారుడు, ఎల్లరు వారి వాక్కులను విని ఆస్వాదించి పునీతులయ్యారు.

## రాజమహేంద్రవర కళాశాలలో అధ్యాపక బృందం

శ్రీ కొండముది వేంకటపున్నయ్య, శ్రీ సంపత్ రాఘవాచారి (ఇంటిపేరు శంఖవరం) ప్రిన్సిపాల్ పదవిలో వరుసగా పనిచేశారు. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల తోడల్లుడు శ్రీ సంపత్ రాఘవాచారి. (వీరి ప్రధమపత్ని – శ్రీ పుట్టపర్తి వారి సతికి చెల్లెలు). ప్రౌఢకావ్య నిర్మాత. కవితాఖండికలు రచించిన కవి వృషభుడు. శ్రీ పుట్టపర్తి శివతాండ నృత్య గేయ రచయిత. కడపలో మాకు గురుతుల్యుడు. మిత్ర ప్రీతి అమితంగా ప్రదర్శించే సాహితీవేత్త.

కళాశాలలో శ్రీ మల్లంపల్లి శరభయ్య (తెలుగు), శ్రీ మానాప్రగ్గడ శేషశాయి (తెలుగు), డా॥ వి.వి.ఎల్. నరసింహారావు (తెలుగు), శ్రీ తనికెళ్ళ శ్రీరామమూర్తి (ఆంగ్లం) మొదలైన మిత్రులు, మఱికొందరు శ్రీమాన్ ఆచార్యుల వారితో కలసిమెలసి వుంటూ సాహితీ చర్చల్లో పాల్గొని సంతోషించేవారు.

## పిఠాపురం మహారాజా వారి ప్రభుత్వ కళాశాల, కాకినాడ - 1966 సం॥

చిరంజీవి శ్రీ భాష్యం శ్రీనివాసాచార్యులు, కుమారుడు, కాకినాడ ఇంజనియరింగ్ కళాశాలలో చదువుతున్నందు వల్ల శ్రీమాన్ ఆచార్యస్వామి కాకినాడకు బదిలీ కోరి అక్కడికి వచ్చారు. శ్రీరామ్‌నగర్‌లో నివాసం. ఆ విషయాన్ని శ్రీ చిత్రకవి ఆత్రేయ చిత్రించిన విధం చిత్రంగా ఉంది.

"అప్పలాచార్యుల ఇష్టదైవము శ్రీరాముడు. అందుకే శ్రీరామ్‌నగరికి వచ్చారేమో! వారి కులదైవం శ్రీనివాసుడు. అందుకే (ఆకెళ్ల) వేంకటేశ్వర శర్మ గారింట్లో నివాసం కల్పించు కున్నారేమో! ఇవన్నీ యాదృచ్ఛిక సంఘటనలే అయినా దైవికాలని అర్థమవుతుంది" (పుట 89, ప్రవచన శిరోమణి).

## ప్రవచనాలు

వసంతనవరాత్రులలోను, శరన్నవ రాత్రులలోను శ్రీమన్నారాయణ తత్త్వాన్ని ప్రబోధించే వారు. వారి ప్రవచనాలలో ప్రసాద గుణం, సారళ్యం సహజగుణాలు. అవి మధురామృత రసాలు. భగవత్‌తత్త్వం అంటే "వాసంతనవరాత్రం", శ్రీతత్త్వం అంటే "శారదనవరాత్రం". ఆ రెంటి కలయికే శ్రీమన్నారాయణ తత్త్వమని వారి ఉపన్యాససార లేశం. సంక్లిష్ట శ్లోకాలకు సైతం వారి విశేషార్ధ విశ్లేషణ, విన్నవారి ఎదలలో హత్తుకొనేవి. ఆళ్వారుల ప్రబోధశక్తి వారికి దైవదత్తం. నిరంతర చింతన, అభ్యాసం వల్ల వారిలో ప్రవచన ప్రవీణత పరాకాష్ఠ నందుకొన్నది. దాసులు, వారి మధురిమను విని, జీవిత పరమార్ధ మెఱిగి, తమ జీవితాలను తరింపజేసుకున్నారు. అందుకే "స్వామి" పదానికి అర్హులైనారు. కంచి కామకోటి పీఠాధిపతులు ఇర్వురు వారికి ఆశీస్సులిచ్చారు. పుట్టపర్తిలో శ్రీ సత్యసాయిబాబా సమక్షంలో అనర్గళమైన ఉపన్యాసమిచ్చి, అచ్చటి సభికులనందరిని, ప్రమోద జలధిలో ఓలలాడ చేశారు. వారి మధుర వాక్పటిమకు అచ్చెరువొందిన శ్రీ సత్యసాయిబాబా, శ్రీ ఆచార్యుల అప్రతిమాన ప్రతిభను ప్రశంసించారు.

## శ్రీమాన్ తెలికచర్ల కందాడై గోపాలాచార్య స్వామివారు

"ప్రవచన శిరోమణి" అనే గ్రంథంలో వెలుపలి అట్టమీద శ్రీ ఆచార్య స్వామి ముఖ చిత్రం, లోపల అట్టమీద శ్రీమాన్ ఉభయవేదాంత తెలికిచర్ల కందాడై గోపాలస్వామివారి నిలువెత్తు చిత్రం, రమ్యంగా గోచరిస్తాయి. ఈ చిత్రం క్రింద ఈ మాటలున్నవి.

*'శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి, ఆధ్యాత్మిక జీవితాన్ని ఒక మలుపు త్రిప్పిన ఆచార్యులు'*

న్యాయవేదాంత విద్వాన్ శ్రీమాన్ గోపాలస్వామివారు పరమాచార్యులు వృద్ధులైన తామే శ్రీమాన్ అప్పలాచార్యుల ఇంటికి విచ్చేసి, తమ తిరుమాళిగకు, గ్రంథాల కాలక్షేపానికి రమ్మన్నారు. ఒక్క సంవత్సర కాలం, కులపతులు శ్రీ భాష్య ప్రవచనం చేశారు. సంప్రదాయాను సారం కనీసం ఇద్దరు ఛాత్రులు ఉండడం ఆచారం. అందువల్ల ఆంధ్ర యువతీమండలి సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్. శ్రీమాన్ తిరుమల పురిహళ్ల వేంకట కోనప్పాచార్యులు సహాధ్యాయి అయినారు. రంగమందిరంలో, పనసచెట్టు క్రింద కూర్చుండి శ్రీ భాష్యాన్ని ఇరువురికి బోధించారు శ్రీ గోపాల దేశికులు. ముగింపునాడు శ్రీమాన్ అప్పలాచార్యులు తమ గురువును గూర్చి అష్టోత్తర శతనామావళి రచించి సమర్పించారు. ఆ నామాలతోనే, ఇప్పటి శిష్యులు శ్రీ గోపాలస్వామివారిని ఆరాధిస్తున్నారు.

## గురుకృప

శ్రీమాన్ గోపాలస్వామి, తమకు ప్రథమ శిష్యులైన శ్రీమాన్ అప్పలాచార్యుల మెడలో, తమ గురువు తమకిచ్చిన తులసిపూల తావళాన్ని వేసి మంగళాశాసనలిచ్చారు. ఆ విధంగా గురువు తమ శక్తిపాతం కలుగజేశారు. శ్రీమాన్ కందాడైవారు, "శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన జీయర్ వంటి ఏడుమంది జీయర్ స్వాములకు, శ్రీమాన్ అప్పలాచార్య స్వామి వంటి పదిహేను మంది ఆచార్యులకు ఆచార్యులు."

(పుట 84 – ప్రవచన శిరోమణి)

(ఆంధ్ర యువతీమండలిని రాజమహేంద్రవరంలో శ్రీమతి బత్తుల కామాక్షమ్మ స్థాపించి, తామే ప్రిన్సిపాలుగా ఉండేవారు. అప్పటి వైస్ ప్రిన్సిపాల్ శ్రీ ఎఱసూరి మల్లికార్జునరావు. శ్రీ రావు (పిల్లనగ్రోవి చక్కగా ఊదేవారు.) వారికడ డా॥ అంతటి నరసింహం, నేను (రచయిత) కొంతకాలం సంస్కృత వ్యాకరణం నేర్చుకొన్నాము.)

## శ్రీమాన్ కోనప్పాచార్యుల పలుకులు

సహాధ్యాయి శ్రీమాన్ కోనప్పాచార్యులు, రాజమహేంద్ర నివాసి తమ అనుభూతిని వ్యక్తం చేసిన సరళిని "ప్రవచన శిరోమణి"లో వర్ణించారు, రచయిత శ్రీ చిత్రకవి ఆత్రేయ.

"వారి సభలకు నేను కూడ తఱచు వెళ్ళుచుండేవాడను. వారు ఎంతసేపు ఉపన్యసించినా, శ్రోతలకు విశిష్టాద్వైతపరముగా సమన్వయించి చెప్పటమేగాని, ఇతర సంప్రదాయములను గాని, సంప్రదాయస్థులను గాని తూలనాడుటలేదు. ఇతర సంప్రదాయ ప్రవర్తకులను చెప్పేటప్పుడు శంకర్ భగవత్పాదులు, శ్రీ పూర్ణప్రజ్ఞులవారు ఇత్యాదిగా మర్యాద ప్రవచనములే

చెప్పెడివారు. ఇందువలన ఇతర మర్యాదస్థులకు మనఃక్లేశము సంభవించలేదు. అప్పలాచార్యుల గారితో వారు మిక్కిలి ఆత్మీయత కలిగియుండెడివారు." (పుట. 87:88)

శ్రీ భాష్యంలో శ్రీసూక్తులు జటిలమైనవి. అంతకంటె సుదర్శన భట్టరు శ్రీ భాష్యానికి వ్రాసిన వ్యాఖ్య "శ్రుతప్రకాశిక" మిక్కిలి క్లిష్టమైనది. అట్టి శ్రుతప్రకాశికలోని అంశాలను కూడా స్వీకరించి, శ్రీభాష్య సూక్తులతో మేళవించి, పంచదార పాయసంలాగా సనాతన ధర్మాలను, సభాసదులచే గ్రహింపచేసేవారు. వారి వాగ్వైఖరి మానవాతీతం. అసాధారణం. అద్భుతమైనది. అదంతా శ్రీ అనంత పద్మనాభస్వామి ప్రభావం.

## శ్రీమాన్ "అనంతప్పాళ్వారు" అనే నామానికి అర్హులు

శ్రీమాన్ అప్పలాచార్యులు నిష్కాములు. వారి జీవిత విధానం పరిశీలిస్తే, పూర్వం విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేసిన మహనీయులైన ఆళ్వారుల కోవకు చెందిన వారని స్పష్టమవు తుంది. జీవితంలో స్వార్థాన్ని అణచుకొన్నారు. వారి మనస్సు నిర్మలమైంది. ధర్మం వైపే వారి మనస్సు పరిభ్రమించింది. ఆచరణయే ఆదర్శంగా ధర్మోపన్యాసాలు కావించారు. శ్రీమాన్ ఆచార్యులు నిరాడంబరులు, నిగర్వి. నిర్వేద సాకారమూర్తి.

## కళ్యాణగుణాలు

అందమైన ఆకారంలో, నిర్మలత్వం, సమదర్శనం, బ్రహ్మతత్త్వజ్ఞత, స్థిరచిత్తత, పరహిత తత్పరత, క్షమ, కృతజ్ఞత, సత్యసంధత, గురుపూజారతి, విష్ణుదాస్యం, ధర్మజ్ఞత, ప్రియవాదిత్వం మొదలైన గుణాలు మేళవించినవి.

శ్రీమాన్ ఆచార్యస్వామివారి గళం నుండి రామాయణాది ప్రవచనాలు, గంగా ఝురి లాగా వెల్వడి దాసులను ఊగించినవి. ఆరోగ్యం క్షీణిస్తున్నా అవ్యయమైన మనోనిగ్రహంతో ప్రవచనాలు ప్రబోధం కావించారు. దాంపత్య జీవితం, ఇహపరసాధకమని తమ గృహస్థ జీవితం ధర్మమయం చేసుకొన్నారు. సామాన్యులు, మాన్యులు, స్వాములు, ఎల్లవారు శ్రీమాన్ ఆచార్య స్వామివారిలో తమ ఇష్టదైవాలను ప్రత్యక్షంగా చూడగల్గినారు. అట్టి శ్రీమాన్ శ్రీ భాష్యంవారు, అందఱి దృష్టిలో ఆళ్వారుస్వామిగా ఆరాధింపబడ్డారు. పన్నిద్దరు ఆళ్వారుల సమాహార మూర్తిత్వం, వారిలో మేళవించిందని నా అభిప్రాయం. అందుకే "శ్రీమాన్ అనంతప్పాళ్వారు" అని మనం గౌరవించడానికి యోగ్యులయ్యారు.

## శ్రీమాన్ శ్రీ భాష్యం స్వామి వారి సన్మిత్రులు

### శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ రామానుజాచార్యులు

"ప్రవచన శిరోమణి" అనెడి పేరుతో శ్రీమాన్ అప్పలాచార్యస్వామి జీవితచరిత్రను శ్రమించి రమణీయంగా రచించారు. ఆ కృతికి తనకున్న అర్హతలు రెండని చదువరులకు ఇట్లు మనవి చేసుకొన్నారు.

"ఒకటి నేను అప్పలాచార్యస్వామివారి అంతరంగ శిష్యుడిని కావడం. రెండు శ్రీ జీయరు స్వామి వారి అంతరంగ తరంగంగా కుదురుకొన్న వాడిని కావడం....."

### చరిత్ర రచన వ్రాయవలసిందిగా ప్రోత్సహించినవారు

"శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారు ఈ దాసుడిని మహామహోపాధ్యాయ శ్రీ ఉభయవేదాంత శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సహస్ర చంద్రదర్శన మహోత్సవ సందర్భంగా వారి జీవిత చరిత్ర వ్రాయమని ఆదేశించారు. వారి ఆదేశమే నాకు గొప్ప వరం అయింది" అని ఆత్రేయ అదృష్టం తన్ను వరించినందుకు తన జీవితం సఫలమయిందని సంతోషించారు. తన విన్నపానికి "జీవిత సాఫల్యం" అని నామకరణం చేశారు.

### జీవిత కాలసాధన "ప్రవచన శిరోమణి"

ఈ గ్రంథ రచన తన జీవిత కాలసాధన అని శ్రీ జీయర్ స్వామివారికి, శ్రీ ఆచార్య స్వామివారికి ఇర్వురికి దశసహస్ర దాసోహములు సమర్పించుకొన్నారు. ఆ గ్రంథం, శ్రీ ఆచార్య స్వామి సహస్రచంద్ర దర్శన మహోత్సవ సభ సమయంలో ఆవిష్కృతమయింది. గ్రంథాంతంలో "శ్రీమాన్ స్వామివారు భగవద్ రామానుజులవలె పరిపూర్ణాయు ర్దాయములో పరిఢవిల్లి భక్తకోటిని తరింపజేయవలెనని ప్రార్థించారు.

గ్రంథం, షోడశ తరంగాలలో (16 ప్రకరణములు), తిరుప్పావై పాశురార్థముల సమన్వయముతో శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్‌స్వామి. నిత్యసంకల్ప మంగళాశాసనములతో సుసంపన్న మయినది. ఎల్లరు తప్పక చదువతగినది.

## శ్రీమాన్ త్రిదండి చిన్న జీయర్ స్వామివారు

"ప్రవచన శిరోమణి" గ్రంథరచనకు సహకరించిన వారెందరో ఉన్నారు. వారిలో ప్రథమ స్థానాన్ని అలంకరించిన స్వాములు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారు."

వారు, 1980 సంవత్సరంలో ఆశ్రమ స్వీకారం చేశారు. వారికి శ్రీమాన్, శ్రీ భాష్యం వారంటే చాలా ఆదరం, గౌరవం, ప్రీతి. శ్రీవారి పలు కార్యక్రమాల్లో పాల్గొన్నారు. "అప్పలాచార్య స్వామివారు, మాకు ఆచార్యులు" అని వారిని ప్రశంసించేవారు.

శ్రీవారు హైదరాబాదులో మూడవ సంవత్సరం "తిరుప్పావై" ప్రవచనాలను (1981-82 సం॥) కావించిన కార్యక్రమంలో తొలిసారిగా శ్రీ చిన్న జీయర్‌స్వామి వారు పాల్గొన్నారు. శ్రీ స్వామి వారు తెలుగులో పాశురార్థాలను వివరిస్తుంటే, శ్రీ చిన్న జీయరు స్వామివారు వాటిని హిందీలోకి అనువదించి చెప్పేవారు. శ్రీ అప్పలాచార్య స్వామివారు తమ ప్రవచనాల ద్వారా నూతనముగా ఆశ్రమ స్వీకారం చేసిన చిన్న జీయరు స్వామి వారి పట్ల శ్రోతల హృదయాలలో భక్తి ప్రపత్తులను పెంపొందించేవారు. తర్వాత హైదరాబాదులో 1984-85 సం॥ ధనుర్మాసంలో జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు భవనంలో, శ్రీ చిన్న జీయర్ తిరుప్పావై కాలక్షేపం ఏర్పాటు చేశారు. 1987 సం॥ శ్రీ ఆచార్యస్వామి వారికి గుండె జబ్బు వచ్చినప్పుడు, శ్రీ చిన్న జీయర్ చాలా ఆందోళన చెందారు తర్వాత శ్రీ చిన్న జీయరు వారి ఆధ్వర్యంలో తిరుప్పావై కాలక్షేపం హైదరాబాదులో చాలాసార్లు జరిగినవి. డిసెంబరు, జనవరి (2002-03)లో శ్రీ స్వామి వారి కుమారుడు శ్రీనివాసాచార్యులు శ్రీ చిన్న జీయరు స్వామి వారి మంగళాశాసనంతో తిరుప్పావై రామాయణ కాలక్షేపాలు వైభవంగా నిర్వహించారు.

## శ్రీ దూర్వాసుల భాస్కరమూర్తి

శ్రీరాముని బంటు హనుమవలె శ్రీ దూర్వాసుల భాస్కరమూర్తి, శ్రీ ఆచార్య స్వామి వారిని సేవించి తన జన్మం తరింపజేసికొన్న చరణదాసుడు. విశాఖ పట్టణంలో, 1978 సంవత్సరం శ్రీ మద్రామాయణ ప్రవచనాలను ప్రారంభింపచేసిన ఘనత వారిదే! అప్పటి నుండి ఆ కార్యక్రమం శ్రీ ఆచార్యుల సమక్షంలో 2003 సం॥ వఱకు జరిగింది. అదే రజతోత్సవం. అదే సహస్ర చంద్ర దర్శన మహోత్సవం (తర్వాత జూన్ నెలలో శ్రీమాన్ ఆచార్యులు విష్ణుధామం చేరుకొన్నారు.)

శ్రీ ఆచార్య స్వామివారి మూర్తిమత్త్వాన్ని శ్రీ భాస్కరమూర్తి, మూడు సూత్రాలలో నిక్షేపించారు. (1) శ్రుతిపక్వమైన నాదం, (2) శ్రుతి సమ్మోదమైన వాదం, (3) లయాన్విత జీవిత విధానం.

(లయమనగా నిస్సంగత్వము. ఆంగ్లంలో detached attachment).

శ్రీ భాష్యం స్వామివారు ఒక చిత్రపటంలో శ్రీ దూర్వాసుల మూర్తికి, చేతులు జోడిస్తూ నమస్కరించే దృశ్యంతో, గురువుగారి వాత్సల్యం, దాసుని సేవానిరతి గోచరిస్తాయి. ఆ ఫొటో క్రింద నున్న వాక్యమిది.

"ఆచార్య స్వామివారికి మిక్కిలి ప్రీతిపాత్రంగా ఉంటూ వారి ప్రవచనాలను మనందరం అందుకునే భాగ్యాన్ని కలిగిస్తున్న శ్రీ దూర్వాసుల భాస్కరమూర్తిగారు "

శ్రీ మూర్తి భాస్కరులై, చిరయశాన్ని ఆర్జించుకొన్న ఋజువర్తనులు. వారికి సాదరాభి వందనలు

## "ప్రవచన శిరోమణి" గ్రంథంలో చిత్రకవి ప్రశంస (పుట 147)

"సాహిత్య ఆధ్యాత్మిక కళాసమాజ సేవా పరాయణులు, గుప్తదాన ధర్మశీలి త్రికరణ శుద్ధి గల ఋజువర్తనులు తన సేవా కార్యక్రమాలకు, సంసారం ఆటంకమని యెంచి బ్రహ్మచారిగా ఉంటున్న త్యాగధనుడు సమాజసేవలకు స్వచ్ఛంద కార్యకర్తలకు ఆదర్శ ప్రాయుడు సమున్నత శీలుడు, ఇంజనీరింగ్ పట్టభద్రుడై హిందుస్థాన్ షిప్ యార్డులో వివిధ విభాగాలకు అధికారిగా పనిచేసి, అధికార విధులు తమ సేవా కార్యక్రమాలకు అడ్డు వస్తున్నాయని భావించి స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసి, పూర్తిగా సేవా కార్యక్రమాలకు అంకితమైన పుణ్యమూర్తి శ్రీ భాస్కరమూర్తి "అంతేకాదు గొప్పలకు, సత్కారాలకు దూరంగా ఉంటున్న నిరాడంబరజీవి!"

నేను (రచయిత), శ్రీ భాస్కరమూర్తిని ఏప్రిల్ నెల 2వ తేదీ, శ్రీ గురజాడ కళాక్షేత్రంలో మొదటిసారి చూచాను వారి సేవాదీక్ష, దక్షత దట్టమైనవి. ఆ కారణం వల్లనే, వారిని గుఱించి ఈ మాటలు వ్రాశాను వారి ఎడతెగని కృషి వల్లనే చాలా వఱకు పెక్కు ఆధ్యాత్మి కోపన్యాస కార్యక్రమాలు విశాఖపట్నంలో జయప్రదంగా జరుగుచున్నవి

## శ్రీ రామాయణ ప్రవచన మహాయజ్ఞ నిర్వహణ సంఘ చరిత్ర

విశాఖపట్నం ప్రజలు, శ్రీమాన్ ఆచార్యస్వామివారి రామాయణ ప్రవచనాల ద్వారా "రామరస వాహిని"ని ఆస్వాదించి సుఖశాంతులతో వర్ధిల్లవలెననే ఆకాంక్షతో, రామాయణ ప్రవచన మహాయజ్ఞ నిర్వహణ సంఘం మొత్తం 24 మంది సభ్యులతో అంగీరసనామ సం॥వత్సరం (1992) నాడు ఆవిర్భవించి ఉగాది నుండి శ్రీరామనవమి వఱకు కార్యక్రమాలను నిర్వహించింది.

### కార్యవర్గం

ఆనరరీ ఛైర్మన్ · శ్రీ పి వి ఆర్ కె ప్రసాద్ గారు, ఐ ఎ యస్

గౌరవ అధ్యక్షులు · శ్రీ డి వి సుబ్బారావుగారు

అధ్యక్షులు : డా॥ కొప్పుచ్చి కృష్ణమూర్తిగారు (విశాఖ మేయరు)

కార్యదర్శి శ్రీ దూర్వాసుల భాస్కరమూర్తిగారు

కోశాధికారి శ్రీ ఎ రాఘవేంద్రగారు

సంపాదకులు శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ రామానుజాచార్యులు

ఆనాటి కార్యక్రమాలు గురజాడ కళాక్షేత్రంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణంతో పంచాంగ శ్రవణంతో, శ్రీ భాష్యంవారి శ్రీ రామాయణ ప్రవచనాలతో ప్రారంభమైనవి.

## శ్రీ ఆచార్య స్వామి వారి సప్తతి

1992 సం॥ ఉగాది నాటికి శ్రీ ఆచార్య స్వామి వారికి డెబ్భై ఏళ్లు నిండినవి 71వ జన్మదినోత్సవం సందర్భంగా, శ్రీ ఆచార్య స్వామి వారి దంపతులకు విశిష్ట సన్మానం జరిగింది ఆ నాడు శ్రీ స్వామివారికి డెబ్బదివేల నిధి సమర్పించబడింది వారు, ఆ మొత్తాన్ని తమదిగా అంగీకరించి, గ్రహించి వెంటనే "సింహాచలం మొదలగు నాలుగు క్షేత్రాల విశిష్ట కార్యక్రమాలకు, పేరుగాంచిన ప్రేమ సమాజానికి సమానంగా అందిస్తున్నట్లు" ప్రకటించారు ఆ ప్రకటనకు ప్రజలు "ఆశ్చర్యాంబుధిలో మునిగి ఆనందవీచికలలో" తేలారు

## స్వభాను సంవత్సర శ్రీ రామాయణ ప్రవచన మహాయజ్ఞం – 2003 సం॥

స్వభాను సంవత్సరం ఉగాది నుండి (2-4-2003 నుండి 11-4-2003 వరకు) పదిరోజులు శ్రీ రామాయణ ప్రవచన ప్రసంగాలు జరిగినవి. **శ్రీ రామాయణ ప్రవచన రజతోత్సవాలు** మఱియు శ్రీ ఆచార్య స్వామివారి సహస్ర చంద్ర దర్శన మహోత్సవములు రెండున్నూ మిళితమై జయప్రదంగా జరిగినవి శ్రీ స్వామి వారికి ఘన సన్మానం, స్వర్ణ కుసుమార్చన, పుష్పకిరీట ధారణం జరిగినవి. మరొక విశేషం, శ్రీ స్వామి వారి 'గీతాజ్యోతి' గ్రంథాన్ని శ్రీమాన్ చిన్న జీయర్ స్వామి వారు ఆవిష్కరించారు. ఆ ఉత్సవకాలంలో శ్రీ భాష్యం స్వామి వారి జీవిత చరిత్ర "ప్రవచన శిరోమణి" శ్రీ చిత్రకవి ఆత్రేయ రచన కూడా ఆవిష్కృతమైంది

## సంపూర్ణ రామాయణ పారాయణం

విశాఖపట్నం తిరుమల తిరుపతి దేవస్థానం కళ్యాణ మండపంలో శ్రీ రామాయణంలోని 24 వేల శ్లోకాల పారాయణం, 24 మంది ఋత్విక్కులచే ఉగాది నుండి శ్రీరామనవమి వఱకు జరిగింది ఆ సమయంలో వైదిక కార్యక్రమాలలో శ్రీమతి బాలకొండలరావు బృందంచే

శ్రీరామాయణంలోని ప్రధాన ఘట్టాలు నృత్యరూపకాలు ప్రదర్శింపబడినవి ఈ కార్యక్రమాలు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీ రంగ రామానుజ జీయరు స్వామి వారి మంగళాసనాలతో జరిగినవి

విశాఖ ప్రజలను తరింపజేసిన శ్రీ ఆచార్యస్వామి 7-6-2003న కన్నుమూశారు తారణ సంవత్సరం వారి ప్రవచనాలు లేని లోటు, తీవ్ర సంతాపకారణమైంది స్వభాను సంవత్సరంలో కాలినొప్పి బాధిస్తున్నా, శరీరంలో పటుత్వం తగ్గినా, ఉత్సాహాతిశయంతో పదిరోజులు, మహోత్సవాలలో పాల్గొన్నారు శ్రీ ఆచార్యస్వామివారు "శరీర మాద్యం పరధర్మ సాధనమ్" అనే నుడిని ఆచరణలో పెట్టిన మహోన్నతులు పరార్థదాసులు

## శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామివారి సహస్ర చంద్రదర్శన మహోత్సవముల విశిష్ట సంచిక (2-4-2003 నుండి 11-4-2003)

ఈ సంచిక పేరు "ఆచార్యోపాయనమ్" పుటలు సుమారు 240 ముఖచిత్రం శ్రీమాన్ ఆచార్య దంపతులు దాని క్రింద శ్లోకం

*రామాయణ రహస్యజ్ఞం, రమ్యవాక్య విశారదం ।*
*అనంతగుణ సంఘాతం అప్పలాచార్య మహం భజే॥*

ఈ సంచికలోని చక్కని రచనల కూర్పును ప్రసాదించినందులకు శ్రీ ఆత్రేయ రామానుజులు అభినందనీయులు స్వామివారి దాసులై తమ జీవితం ధన్యం జేసుకొన్నారు పలువురి సందేశాలు, అభినందనలు, కవితలు, ప్రశంసలు, ప్రేమాంజలులు వాహినియై ప్రవహించినవి

## ఆది సందేశం

శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ జయేంద్ర స్వామి వారిది రెండవది శ్రీశ్రీశ్రీ జగద్గురు దక్షిణామ్నాయ శృంగేరీ శారదా పీఠాధిపతిగారిది.

వ్యాసాలలో అన్నింటికంటె విషయ విస్తారం కల తొమ్మిది పుటలు (34 నుండి 42 పుటలు) శ్రీ ఆచార్య స్వామి వారి తోడల్లుడు శ్రీ ఉ.వే. శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్య స్వామి వారిది అందులో వారు స్వామి వారిని గురించి చెప్పిన కొన్ని వాక్యాలను ఉదాహరిస్తాను

"... అప్పటికి ఆచార్యుల వారు ఎస్ ఎస్ ఎల్ సి లో మాత్రం ఉత్తీర్ణులు. అట్టివారి ఆంగ్ల భాషా పాండిత్యమెట్టిదో తెలియనిది స్వామివారి ప్రతిభ అనన్య సామాన్యం. కావ్య

నాటక అలంకార వ్యాకరణ గ్రంధాలను ఆంగ్ల భాషలోనే సమర్ధంగా బోధించే సామర్ధ్యానికి ఆనాటి సంస్కృత శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ శంకరన్‌గారు ఆశ్చర్యచకితులైనారు "

. . ప్రెసిడెన్సీ కళాశాలలోనే ఉపన్యాసకులుగా ఉండే శ్రీ పి ఎస్ ఆర్ అప్పారావుగారు శ్రీ అప్పలాచార్యస్వామి వారి సాహస్య చర్య ఫలితంగా ఉత్తేజితులైనారు శ్రీకాకుళంలో స్వామివారి అతిధియై భరతనాట్య శాస్త్రాన్ని అభినవ గుప్తవ్యాఖ్య సహితంగా ఆంధ్రీకరించినారు **నాట్యశాస్త్రంలో అనుపదం, శ్రీమాన్ అప్పలాచార్యులవారి అదృశ్య హస్తముద్రలే!!**

(శ్రీ అప్పారావు రెండవ గ్రేడు ఉపన్యాసకులుగా రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో పనిచేయుచున్నప్పుడు, నేను 1949 సం॥ ఆ ప్రభుత్వ కళాశాలలో ట్యూటరు పదవిలో చేరి వారితో కలిసి పనిచేశాను )

నన్ను ఆకర్షించిన మఱొక వ్యాసం (185-191) ఏడు పుటలు "రామాయణ భారతాధ్యయనము, ఆవశ్యకత" జస్టిస్ పమిడిఘంటం కోందదరామయ్యగారిది వారు సంస్కృత రామాయణ, భారతములకు, బ్రహ్మసూత్రాలకు తెలుగు వ్యాఖ్యలు వ్రాయించి ప్రచురించారు ఆంగ్లంలో 'లైట్ ఆఫ్ రామాయణ' అనే గ్రంధం వ్రాశారు. దీనికి, తమిళ, కన్నడ, తెలుగు అనువాదాలు రచియింపబడినవి. ఆంగ్లంలో వారు రచించిన "ది మెసేజ్ ఆఫ్ మహాభారత" అనే బృహద్ గ్రంధాన్ని భారతీయ విద్యాభవన్ వారు ఆదరించి, ప్రచురించారు.

చివరగా మూడవదిగా నా మెప్పునకు అర్హమైనది "వెలుగుల వాకిట" అనే వ్యాసం రెండుపుటలే (32-33) రచయిత "అక్షర వాచస్పతి డా॥ దాశరధి రంగాచార్యులు " విశిష్ట సంచికను సమీక్షించడానికే మూడింటిని మాత్రమే ఎన్నుకొన్నాను అన్ని రచనలు మెఱుగుగా నున్నవి

# శ్రీమాన్ ఆచార్యుల వారి రచనలు

1 రామాయణము . తత్త్వదీపిక (అన్ని కాండములు)
2 తిరుప్పావై తత్త్వదీపిక
(ప్రథమ ముద్రణము ఆంధ్రవివరణతో, కాకినాడలో – 1974 సం॥)
3. భాగవతము · తత్త్వదీపిక (అన్ని స్కంధాలు)
4. శ్రీ తత్త్వము భగవత్ తత్త్వం – ప్రసంగములు
5 శ్రీవచన / భూషణము తెలుగు అనువాదం
6 ముకుందమాల · వ్యాఖ్య
7 సుందరకాండ ప్రసంగములు
8 గీతాజ్యోతి – వ్యాఖ్యానము
9 మాండూక్యోపనిషత్తు – తెలుగు వివరణము
10. దాశరథీ శతకము – తత్త్వదీపిక
11 ఆదిత్యహృదయము – వ్యాఖ్య
12 విభీషణ శరణాగతి
13. ఏడుకొండలు – ఏడుకాండములు
14 రాముడు మానవుడే
15. నిత్యపూజావిధానము (సంకలనము).

**శ్రీ చెళ్లపిళ్ల సీతారామమూర్తిగారు :** వివేక, జ్ఞాన వయోవృద్ధులు శ్రీ చెళ్లపిళ్లవారు పై వానిలో, ఈ ఆరింటికి – 1. ముకుందమాల, 2 దాశరథీ శతకము, 3 ఆదిత్య హృదయము, 4. విభీషణ శరణాగతి, 5 ఏడుకొండలు–ఏడుకాండములు, 6. రాముడు మానవుడే – ఆంగ్లవివరణములు రచించారు

Prof K Veerabhadra Rao, M A , Ph D ,
16, Sivarama Krishna Colony,
West Marredpally Main Road,
Secunderabad - 500 026 (A P.)
© 27800670

Some Academic And Professional Particulars at a Glance of Prof Kothapalli Veerabhadra Rao

Date of Birth 19 May, 1921 - Rajahmundry, (East Godavari Dist ) Andhra Pradesh, India

| | |
|---|---|
| 1942 | M A I Class. I Rank, Oruganti Somasundaram Award for getting I Rank Telugu (A U ) |
| 1956 | Ph D Subject "Influence of English on Telugu Literature" (Both from the Andhra University, Waltair, A P, India) |
| 1966 | Diploma in Linguistics |
| 1967 | Certificate in Russian |
| 1968 | Diploma in Russian. (All from the Delhi university, Delhi, India). |
| 1942 | Sahitya Ratna (Hindi) |

## PROFESSIONAL

Overall teaching, research and administrative experience of 60 years (1942 - 2002)

| | |
|---|---|
| 1942-1959 | Head, Department of Oriental Languages, Maharajah's College, Vizianagaram (Andhra Pradesh) |
| 1959-1968 | Head, Department of Telugu, Delhi University, Delhi. |
| 1961-1962 | Visiting Professor, Indian Studies Department, Wisconsin University, Madison (U S A ) (On lien from the Delhi University) |
| 1968-1978 : | Telugu Akademi (Telugu Language Institute) Hyderabad |
| 1978-1987 . | Professor and Head of the Department of Telugu, Director, Centre for Regional Studies and Dean, School of Social Sciences - Central University of Hyderabad - Hyderabad (A.P.) |

| | | |
|---|---|---|
| 1985-1986 | · | Chairman, Official Language Commission, Government of Andhra Pradesh, Hyderabad (On lien from the central University of Hyderabad). |
| 1987-1988 | · | Professor and Dean. School of Literature, Rajahmundry Campus, Sri Potti Sriramulu Telugu University, Hyderabad |
| 1989-2002 | | Professor and Head (for some years) Department of Jyotisha, Sri Potti Sriramulu Telugu University, Public Gardens, Hyderabad. |
| 1999-2000 | | Senior Research Fellow, H R D Government of India, New Delhi Project |
| (Completed) | | Life and letters of the Telugu people in the 19th Century (Subject) |

Some Important Publications (In Telugu)

- Influence of English on Telugu Literature (English Title) I Edition - 1960 Pages XXIV + 552 - Enlarged and Revised - II Edition - 1986 : Pages XVI+792).
- C P Brown (1794-1884) A Biography of a British Civilian of the 19th Century who was also a Telugu Scholar (I Edition - 1963 Pages XXIII+279 Enlarged and Revised - II Edition - 1988 - Pages XVI+488+XXIV)

Arthur Cotton (1803-1899) A Biography of Sir Arthur Cotton, the builder of the Godavari Anicut - A Telugu University Publication, 1989 - Hyderabad

- Vanga Sahitya Charitra (Telugu translation of Prof Sukumar Sen's Book). A Central Sahitya Akademi Publication, 1966 - New Delhi
- Guru Nanak (Telugu translation of Dr. Gopal Singh's book) A National Book Trust Publication, 1969 - New Delhi

Konda Meeda Manta (Fire on the Mountain) (Telugu Translation of Anita Desai's English Novel) A Central Sahitya Akademi Publication, 1998 New Delhi

- Avatara Tattva Vivechana - Pages 8+424+121-1998. (Author's Own Publication)

**Experience on the Expert & Examining Bodies of Universities**

Andhra, Delhi, Dravidian, Hyderabad Central, Kakatiya, Karnataka, Kerala, Madras, Madurai, Nagarjuna, Osmania, Sri Krishna Deva Raya, Sri Venkateswara, Telugu and Wisconsin, Madison (U S A.).

Member (Elected) - Senate and Academic Council of the Andhra University (1957-1959)

Adjudicator for more than 100 Ph D, and M Phil, dissertations Produced 10 Ph D , and 25 M Phil , degree holders as Guide and Supervisor Produced the first Ph D in Telugu from the Delhi University 1968 1998 First Chairman Subjects Committee for Comparative Literature and philosophy, Dravidian University, Kuppam - 517 425 (A P) 1999 Nominated Member Academic Advisory committee, Dravidian University, Kuppam

## EDITORIAL EXPERIENCE

| | | |
|---|---|---|
| 1972-1978 | · | Founder Editor of 'Telugu' a Journal of the Telugu Akademi, Hyderabad. |
| 1994 | : | One of the three Editors of 'World Literature' (in Telugu) A Publication of the Encyclopaedia Centre, Potti Sriramulu Telugu University, Hyderabad |
| | · | Expert committee member of T.T.D. Publications Tirupati (For many years). |

## SOME IMPORTANT NATIONAL & INTERNATIONAL CONFERENCES ATTENDED IN THE LAST TWO DECADES

| | |
|---|---|
| 1980 (24th through 26th January) | All India Conference of Linguists and Platinum Jubilee of Comparative Philology - Calcutta University, **Calcutta.** |
| 1981 (14th through 26th October) | Second World Telugu Conference, **Kaula Lampur, Malaysia.** |

| | | |
|---|---|---|
| 1981<br>(21th through<br>26th October) | : | World Sanskrit Conference, **Benaras.** |
| 1982<br>(5th through<br>7th February) | : | International Seminar on "Books for all at low cost" - National Book Trust, India - **New Delhi.** |
| 1982<br>(25th through<br>28th February) | : | Seminar on "India and the west" Organised by the South Asia Institure of the University of Heidelberg in co-operation with the Cultural Department of the Embassy of the Federal Republic of Germany and Max Muller Bhavan, **New Delhi.** |
| 1983<br>(13th through<br>15th May) | | "Sufism in India", Kashmir University, **Srinagar.** |
| 1984<br>(15th through<br>20th March) | | First International Conference on "Literature in Translation" - "The Role of Foreign Languages in Cross - Cultural Communication" - Sponsored by the School of Languages, Jawaharlal Nehru University, **New Delhi.** |
| 1985<br>(25th February<br>through Ist March) | : | International Symposium on "India and World Literature" Department of Modern European Languages, University of Delhi and Indian Council for Cultural Relations, **New Delhi.** |
| 1986<br>(10th through<br>13th January) | : | World Congress for the "Synthesis of Science and Religion" Bhaktivedanta Institute, **Bombay.** |
| 1991<br>(5th through<br>7th January) | : | 5th International Seminar on "Astrology and Occult Sciences", sponsored by International Council of Astrological and Occult Studies (Guntur and Hyderabad) held at **Tirupati.** |
| 1995<br>(24th through<br>27th November) | : | International Conference of Telugu Teachers, Port Louis, **Mauritius.** |

# SOME IMPORTANT ENDOWMENT AND MEMORIAL LECTURES FELICITATIONS & AWARDS GIVEN IN THE LAST DECADE

| | |
|---|---|
| 1990 (23rd August) | Srimati Yerramreddy Ranganayakamma Memorial Lecture and Award |
| 1990 (8th December) | Kavi Prabha Trust (Masulipatam) Endowment Lecture and Award |
| 1991 (2nd August) | Endowment Lecture and Award, Sri Venkateswara University, Tirupati. |
| 1992 (22nd and 24th January) | Endowment Lectures and Award, Madras University, Madras |
| 1992 (27th, September) | Golden Jubilee (of My Teaching Career) Felicitation by Old students and Admirers. Hyderabad |
| 1995 (16th December) | Sri Laksmi Sarvaraya Sahitya Puraskar (Award) (Sarvaraya Educational Trust) Rajahmundry. |
| 1997 (8th February) | Dr. Sobhirala Satyanarayana Memorial Lecture and Award, Hyderabad. |
| 1997 (8th April) | Vijaya Bhavana of Vizianagaram - Telugu New Year (Iswara) Felicitation and Award with the title of "Desikothama" (Eminent Teacher). |
| 1997 (24th August) | Sri Gannabattula Tulasamma Peda Tata Literary Award, Bhimavaram (West Godavari District) A P |
| 1997 (10th September) | G.V S. Literary Trust Award for the year 1997, Hyderabad |
| 1998 (25th November) | Prof. Nidudavolu Venkata Rao Memorial Lecture and Award, "Kinnera", Hyderabad. |
| 1999 (28th August) | Diamond Jubilee (as a Scholar and a writer) Felicitation by my Old Students and Admirers, Hyderabad. |
| 1999 (11th November) | Raja-Lakshmi Foundation (Chennai) Literary Award. |

| | |
|---|---|
| 2000 (5th March) | Mahakavi Madhunapantula Satyanarayana Sastry Memorial Lecture and Award, Rajahmundry (East Godavari District) A.P. |
| 2001 (22nd December) | Potti Sriramulu Telugu University Literary Award for the year 2000 for my book "Avatara Tattva Vivechana" |
| 2002 (31st January) | Sanathana Dharma Charitable Trust (Reg ) Bheemunipatnam - 531163 - "Sivananda Eminent Citizen" Award |
| 2002 (28th March) | Felicitation by the Official Language Commission Government of Andhra Pradesh, as a Former Chairman. |
| 2002 (30th May) | Sri Majeti Ramappa Memorial Lecture and Award... (Potti Sriramulu Telugu University, Hyderabad). |
| 2003 (14th May) | Felicitation and Award (Kinnera Art Theatres, Hyderabad). |
| 2003 (ist November) | Telugu Honour Award (Telugu Atma Gourava Puraskaram by Government of Andhra Pradesh) |

## BIO-DATA OF "ACHARYA" SRI APPALLA SOMESWARA SARMA (TRADITIONAL SANSKRIT SCHOLAR)

1. **NAME :** SOMESWARA SARMA
2 **SURNAME :** APPALA
3 **DATE OF BIRTH :** 15-10-1920
4 **QUALIFICATIONS :**
   (A) "VYAKARANA VIDYA PRAVEENA"
   (1st class, 1st rank, Gold Medal awarded, Andhra 'varsity, 1939 Regular study in Maharaja's Sanskrit college, Vizianagaram).
   (B) "SAHITYA VIDYA PRAVEENA"
   (1st with rank, Andhra 'varsity, 1942, private study).
   (C) "BHASHA PRAVEENA" (TELUGU)
   (1st class with rank Andhra 'varsity, 1952, private study)
   (D) P.O L
   (1st class with rank, Andhra 'varsity, 1944, private study).
   (E) M.A. (SANSKRIT)
   (1st class with rank - Benaras Hindu University, 1960, private study).
   (F) DIPLOMA IN "JYOTHISHA"
   (Govt. of Madras exams, 1938).
   (G) DIPLOMA IN HINDI "RASHTRA BASHA"
   (Dakshina Bharata Hindi Prachara Sabha, Madras, 1949).

5. **SANSKRIT TEACHING SERVICE :**
   (A) "GURUKULA" SANSKRIT SCHOOLS,
   Vizianagaraam Samsthanam (9 years).
   (B) MAHARAJA'S SANSKRIT COLLEGE,
   Vizianagaram (1 year).
   (C) Sanskrit Mahavidyalaya and S.V.O. Research Institute,
   Tirupati (4 years)
   (D) MAHARAJA'S ARTS COLLEGE,
   Vizianagaram (9 years).
   (E) ASSOCIATE PROFESSOR OF SANSKRIT,
   ANDHRA UNIVERSITY, Visakhapatnam (18 years).

N.B. : Total teaching service 41 years at all levels. More over I have been teaching several subjects (Vyakarana, Alamkara, Vedanta etc.) to deserved students till today even after my retirement in 1980. It is my life's sincere

mission. So "Diamond Jubilee" of my "Teaching service" is to be celebrated this year

6. **TITLES AND HONOURS OBTAINED :**
   (A) "VYAKARANA ALAMKARA CHAKRAVARTI"
   (Conferred by Tirupathi kavita samithi, TIRUPATHI, 1951)
   (B) "SAHITYA VISARADA"
   (Given by "Bharati Teertha", VIZIANAGARAM, 1960)
   (C) Golden "KANKANAM" Bracelet, "Navaratna" chain and so many presentations were awarded to me by students and various literacy and cultural associations of Visakhapatnam and its surroundings.

7. **HONORARY POSITIONS :**
   (A) PRESIDENT - "SRI GEETHA PRACHARA SAMITHI", VISAKHAPATNAM.
   (B) PRESIDENT - "SRI GEETHA SATSANGAM", VISAKHAPATNAM.
   (C) PRESIDENT - "SRI KAVYA KANTA PEETHAM", VISAKHAPATNAM.

8. **PUBLISHED BOOKS AND ARTICLES :**
   (A) SAHITYA VIMARSAH
   (Literary criticism in Sanskrit.
   Published by S.V.O R. Institute, TIRUPATHI, 1951)
   (B) NIPATAYAYO PASARGA VRITTI
   (Published by S.V.O.R Institute, TIRUPATHI, 1951).
   (C) SAHITHYASARAH
   (Published by S.V.O.R. Institute, TIRUPATHI, 1951).
   (D) KAUMUDI SARADAGAMAMU
   (A commentary in Telugu on Siddhanta Kaumudi. Part-I in 1941, Part-II in 1982)
   (E) VAKYA PADEEYAMU -
   (A Telugu commentary on "Vakyapadeeyam". Published by Telugu Academy, Hyderabad in 1980)
   (F) ARSHA VIJNANA SARVASWAMU
   (Six Essays published by T.T.D. TIRUPATHI, 1982).
   (G) AMARAVANI PRASARAMULU
   (Radio talks-A.P. Sahitya academy, 1970)

(H) JAGAT JYOTI
(Two Parts - edited them fully - Published II edition in 1982)

(I) DHARMA VYADHUDU
(Srinivasa Balabharati, T.T.D. 1981)

(J) SAYANA CHARYULU
(Srinivasa Balabharati, T.T.D. 1981)

(K) VEDA BHUMI
(An analysis of vedic rituals, 1997)

(L) A commentary in Telugu on "SANKSHEPA RAMAYANAM", in 1997.

(M) SADDARSANAMU
(A Telugu commentary on Bhagavan Ramana Maharshi's work, 1998).

(N) A Sanskrit commentary on "BHAGAVADGITA"
Published by Kanchi Kamakoti Peetham.
(Co-Author with Prof. G.S.R. Narasimha Murty of U.S.A. in 1999, Recognized & Appreciated by the Prime Minister of India).

(O) So many Articles were published in Telugu and Sanskrit Journals (Literary & Spiritual)

(P) About 150 Radio talks in Sanskrit and Telugu were broadcast from A.I.R. VISAKHAPATNAM & VIJAYAWADA.

9. **PRESENT ACTIVITIES :**

Delivering discourses on literary, cultural and spiritual subjects especially on Bhagavadgita and Upanishads.

10. "ఆత్మీయము" (2 భాగములు - స్వజీవిత కథ)
"యోగేశ్వరీయము" (శ్రీ అ. జోగన్నశాస్త్రి కథ)

A. SOMESWARA SARMA
అ. సోమేశ్వరశర్మ
26-05-2004

**ADDRESS :**
H.No. : 50-96-8/2,
T.P.T. Colony,
Seethammadhara,
Visakhapatnam-530 013,
Andhrapradesh.
Phone No. : 0891-2528410

N.B. : రచించిన ఆధ్యాత్మిక వ్యాసాలకు లెక్కే దొరకదు.

Appendix-I
(Some Details)

1. **TEACHING** Vyakarana, Alankara and Advaita - taught traditionally for sixty years (till to-day). About 200 students - Trained for P.G. Degree. About 12 students for Ph D , (Regular and Private study).

*Taught the subjects through the Medium of Sanskrit in several Institutions including the S.V.O. College and S.V.O.R. Institution Tirupathi - 1949-1953. Also in the Department of Sanskrit, Andhra University, Visakhapatnam (1962-1980).*

2. **DISTINGUISHED FELICITATIONS (ACHIEVED)**

(A) Felicitated by various Scholars and citizens of Visakhapatnam in July 1999 with "Golden Bracelet" and "Kankanam".

(B) Felicitated by Prof. Murali Monahar Joshi (Hon'ble minister for Human Resource Development, Government of India) and Rashtriya Sanskrit Samsthan (New Delhi) on 28-3-2000 with a Purse and a Shawl, at the "All India Sanskrit Scholars Conference - New Delhi".

(C) Felicitated by Sri H.E. Krishna Kanth (Vice-President of India) in Visakhapatnam on 2-12-2001 as a Distinguished Sanskrit Scholar

(D) Felicitated by Andhra University in September, 2000 on the occasion of "All India Sanskrit Seminar".

1 సహస్ర మాస సంజీవనము.

2 అరవై అయిదు వసంతాల ఆచార్యకము.

3. సహస్ర చంద్రదర్శనము.

మొదలైన సందర్భాలలో కూడా బహు సన్మానాలు జరిగినవి.

(A. SOMESWARA SARMA)

Visakhapatnam
Dated 22-01-2002

# తెలుగు గోష్ఠి

## హైదరాబాదు

### <u>కార్యనిర్వాహక కమిటి</u>

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | – | శ్రీ వి.వి. సుబ్రహ్మణ్య శర్మ |
| ఉపాధ్యక్షులు | – | ఆచార్య జి. చెన్నకేశవ రెడ్డి |
| కార్యనిర్వాహకులు | – | డా॥ పగడాల చంద్రశేఖర్ |
| కోశాధికారి | – | డా॥ పి. నాగేశ్వరరావు |
| సభ్యులు | – | డా॥ ఇ. శివనాగిరెడ్డి |
| | | డా॥ వై. నిత్యానందరావు |
| | | డా॥ కె. రాజలలిత |
| | | శ్రీ కె. జితేంద్రబాబు |
| | | డా॥ జి. హరిహరనాథ్ |
| | | డా॥ ఎన్. మార్కండేయ శర్మ |
| | | శ్రీ రవీంద్రనాథ్ |
| | | డా॥ ఓగేటి ఇందిర |
| | | డా॥ మంగళగిరి ప్రమీలాదేవి |